

# కొత్త సుప

నీలి బార్



మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే.
న్యూ సుప డిటర్జెంట్‌బార్ సబ్బు నురుగులో
తెల్లదనం బూడిదరంగు మురికిని వదిలించి
మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి
ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను,
రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను,
కనిపిస్తాయి. అన్ని రకాల దుస్తులకు ఇది
అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్‌బార్ కన్న
న్యూ సుప డిటర్జెంట్‌బార్ చాలా పొదుపైనది.




## మీ బట్టలకు తెల్లని
## తెలుపును కాంతిని
## తిరిగి తెస్తుంది



HARYANA DETERGENTS LTD

maa HDL 1b-79 Tel

2.4.677

# హార్లిక్స్




## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండా తట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకూరుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే. మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థాలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమైనాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోని వారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారసు చేస్తున్నాను"




**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.





# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 – 1972]

శుక్రవారం : 2 11 '79
సిద్ధార్థినామ సం. కార్తిక శు. త్రయోదశి
సంపుటము 73 · సంచిక 10

సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# మనలో మాట

ఈ సంచికలో ★ హృదయం ★ పెద్దకొడుకు కథలు వేశాము-. దీంతో దీపావళి కథల పోటీలో బహుమతులు పొందిన ఐదు కథల ప్రచురణ పూర్తి అయింది. ఇక వీటిపై పాఠకుల అభిప్రాయాల్ని తెలుసుకుని, అదనపు బహుమతులను యిచ్చే నిమిత్తం, యిక్కడ బ్యాలట్ పత్రం యిస్తున్నాము. ఐదు కథలు చదివి అందులో మీకేది అన్నింటికన్నా బాగుందనిపిస్తుందో దాని పేరు బ్యాలట్ పత్రంలో నింపండి. దాన్ని కత్తిరించి కవరులో పెట్టి మాకు పంపండి.

* * *

ఈ ఐదు కథలను సమీక్షిస్తూ ఒక చిన్న వ్యాసం రాయండి— వ్యాసం నిడివి '800 – 1000' అక్షరాల మధ్య వుండాలి- వ్యాసంతో పాటు విధిగా బ్యాలట్ పత్రం పూర్తిచేసి జతచేసి పంపించాలి.

ఈ వ్యాసాలలో మూడింటికి ప్రథమ బహుమతి రు. 250 లు ద్వితీయ బహుమతి రు. 150 లు తృతీయ బహుమతి రు. 100 లు చొప్పున యిస్తాము-వ్యాసంలేకుండా బ్యాలట్ పత్రం నింపి పంపవచ్చును. కాని వ్యాసంతోపాటు బ్యాలట్ పత్రం విధిగా వుండాలి మీ పూర్తి పేరు, చిరునామా కూడా విడి విడిగా తెలుగులో వ్రాయండి!

పాఠకుల నిర్ణయం ప్రకారం బహుమతి విజేతలకు అదనపు బహుమతు లందుతాయి. వీటి వివరాలు క్రిందటి సంచికలోనే యిచ్చాము. మీ సౌలభ్యం కోసం కథల పేర్లు యిక్కడ యిస్తున్నాము. ★ నిజం ★ పనిష్మెంట్ ★ పులివచ్చె మేక ★ హృదయం ★ పెద్దకొడుకు ★

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**బ్యాలట్ పత్రం** ముగింపు తేదీ **24-11-'79.**

నాకు నచ్చిన దీపావళి కథ

"................................................................"

పంపినవారి పూర్తి పేరు : ..........................................................

చిరునామా : ..........................................................

..........................................................

..........................................................

వ్యాసం ఉంది / లేదు

## ఉత్తరాలు

### ముఖచిత్రం

19 10.79 నాటి అభినవ నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచిక మా హృదయాలను ఆకర్షించింది. ప్రచురించిన కథలు అన్నిటిలో కని, హాస్యకథ వెరి ఫైన్. ఈ వరం ఫోటోల్ని సైడ్, కొరస్పాన్స్ కదుపుల్ని మెచ్చుకుంటాము.

షేక్ అబ్దుల్ రహిమాన్, తాతిరాజు (కందుకూరు)

* * *

శ్రీదేవి ముద్దులొలికే ముఖచిత్రంతో వెలువడ్డ ఈ వారం పత్రిక చాలా అందంగా ఉన్నది. "నళిని" సీరియల్ చాలా ఆసక్తిదాయకముగా ఉన్నది. సినిమా విశేషాలలో మీరు తీసికొనే శ్రద్ధ ఎంతైనా ప్రశంసనీయం. జోక్స్ విషయంలో ఇంకొంత శ్రద్ధ తీసికొనండి.

డా. ఎస్. పద్మప్రసాదిరెడ్డి, [కర్నూలు]

### కథలు

19 10.79వ తేదీన వెలువడిన శ్రీదేవి ముఖచిత్రంతో ఆంధ్ర సచిత్ర వార పత్రిక చూడముచ్చటగా ఉంది. ప్రచురించిన కథలన్నీ బాగున్నవి ఫోటోల్ని నిద్రతీ ద్వారా చాలా విషయాలు తెలుసుకుంటున్నాం కార్టూన్లు కూడా బాగున్నవి కె. రామలక్ష్మిగారి ప్రశ్నావళి చాలా ఘాటుగా ఉంది.

వెంకుమహంతి రమేష్‌పట్నాయక్,
వెంకుమహంతి మన్మథపట్నాయక్.
(బరంపురం).

### సీరియల్

"నళిని" సీరియల్ ముగింపు గురించి నేను వూహించింది వేరు. నా వూహను తారుమారు చేసింది రచయిత్రి. తెలుగు వారికి నచ్చే పద్ధతిన కథను ముగించింది. కథలో (వాసు) పాత్ర అను వర్తనానికి సుదూరంలో ఉంచి పరిప్రవర్తన పట్ల పతితలకు జాలికలిగేలా మలిచింది. నిజ జీవితంలో ఇలాటివారు ఉంటారా? అని పిస్తున్నది. నళిని సీరియల్ వ్రాసిన రచయిత్రికి ప్రచురించిన మీకు ఆంధ్ర సచిత్ర వార పత్రిక ద్వారా మా హృదయపూర్వక అభినందనలు అందజేయుచున్నాము. ప్రేమపాశము సీరియల్ బాగుంది. జానకి, శాంతి పాత్రలు కథలో పోటి పడుతున్నట్లుగా ఉంది.

శ్రీమతి డి. ప్రమీలా రాఘవరెడ్డి (కడప)



దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన కథ

# హృదయం

'మొద్దు !'

"వాడొట్టి 'రాయి' !"

'అయ్యా అవ్వా అక్కా ఎవ్వరొద్దూ వాడికి ఏ ప్రేమల్లేవ్' దున్నపోతు !' ఇలా ఎన్నో తిట్లు తిన్న బుచ్చిగాడు కరగడని ఊరందరి చేతా అనిపించుకున్న బుచ్చిగాడూ కరిగిపోయిన మంచులాగ తెగిపోయిన పైకిలాగ ఒంటే ఏడుస్తున్నాడు.

వాడేడుస్తుంటే చాలామందికి ఆశ్చర్యంగా వుంది.

మంచం మీద పడుకునీ పడుకునీ, మంచమే తనై తనే మంచమై జీవించిన నాయనమ్మ ప్రమోషనొచ్చినట్టు మంచం మీంచి నరగా 'పాడె' మీదికీ, పాడె మీంచి తిన్నగా కాడు మీదికి వెళ్ళిపోయినప్పుడు ఆ ఊరంతా ఏడిచింది— కానీ బుచ్చిగాడు ఏడ్వలేదు

గాంధీగారిలాగ బతకాలనీ, గాంధీగారిలాగే చావాలనీ కలలు కన్న నాళ్ళ రాజకీయపు దిక్కు పెదనాన్నగారి శవయాత్రకు ఊరు ఊరంతా ఏడ్చింది. కానీ, బుచ్చిగాడు మాత్రం ఏడ్వలేదు.

అమ్మలేని తన సంసారమునీ, చుట్టాలేని తను గడించిన నోట్ల కట్టలనీ భావించి తన సర్వస్వాన్నీ బంధు పోషణ కోసం ధార పోసిన అమ్మ తరఫు మీసాల తాతయ్య చచ్చిపోయినప్పుడు బంధుకోటి అంతా ఏడ్చింది— కానీ, బుచ్చిగాడి నేత్రం ఏడ్వలేదు.

అందుకే వాణ్ణి 'రాయి' అన్నారంతా—

ఆ రోజు 'మూత్కా' ముందని అందరూ అరుగుమీదే పడుకున్నారు. తనొక్కడే వేరుగా వాకిట్లో పడుకున్నాడు. ఏ రాత్రికో పక్క తిరిగి నిద్రలోనే చెయ్యి వేసి చూశాడు. ఏదో వెలితి కనిపించినట్టయింది. కావల్సిందేదో లేనట్లు పీలయి పక్కంతా తడిమి చూశాడు కళ్ళు తెరవకుండానే. అకస్మాత్తుగా భయపడ్డట్టు లేచి కూచున్నాడు.

'తన నీలూ' 'తన నీలూ'

నీలు ఎక్కడా కనిపించట్లేదు. చీకటిగా ఉన్నా తెల్లారబోతున్నట్టు సన్నగా కనిపిస్తోంది. ఆ చుట్టుపట్ల వెదికాడు. ఎక్కడా నీలూ జాడలేదు. నిరాశపడ్డాడు. పూర్తిగా తెల్లారినాక వెదుకుదామని మెల్లగా ఒరిగాడు.

భయం ! ఆలోచన్లు !

ఆలోచన్లు దయ్యాల్లా పీక్కుతింటున్నాయి. భయం రంపంలా కోస్తోంది. 'నీలూ' అని అరుద్దామనుకున్నాడు. నోరు రాలేదు. నిద్రరాలేదు. పెరట్లో దొడ్లో వెదుకుదామని లేచాడు. చిన్నగా అడుగులేస్తూ తీక్షణంగా చూడసాగాడు.

తెల్లారుతోంది. వెలుతురొచ్చేస్తోంది.

సూర్యుడు 'నేనున్నాలే నీ నీలూని వెదికిపెడతా' నన్నట్టు పైకొచ్చేస్తున్నాడు. బుచ్చిగాడికి సూర్యుడంటే భలే ప్రేమ. అప్పుడప్పుడూ బుచ్చిగాడనుకునేవాడు — 'నీలూ లేకున్నా సూరీడు లేకున్నా బావి కాడి చింతచెట్టు లేకున్నా తను బతికేవాడు కాదేమో'నని.

ఆ మూడే తను చాలా ఇష్టపడేవి. ఆ మూడే తన పంచప్రాణాలు. నీలూ కనిపించక పోయేసరికి బుచ్చిగాడికి పిచ్చెక్కుతున్నట్టనిపించింది.

తైలా ప్రాణం మజ్జా దగ్గర ఉన్నట్టు, దొర ప్రాణం చిలకమ్మ మీదున్నట్టే ఆ వూరు షావుకారు ప్రాణం తిజోరిలో ఉన్నట్టే బుచ్చిగాడి ప్రాణం 'నీలూ' దగ్గర ఉంది.

నీలూ అంటే ప్రణయాధిదేవత కాదు, ఉడికించే ఆడది అంతకన్నా కాదు. తిజోరి పేరు అసలే కాదు. వీటన్నిటి కన్నా ఎక్కువే బుచ్చిగాడికి.

నీలూ అంటే తన ఫ్రెండ్ ! తన సర్వస్వం !

కానీ, ఆ వూరందరికి మాత్రం నీలూ అంటే పిల్లి ! మామూలు పిల్లి ! చిన్న జంతువు.

ఆ పిల్లికోసం పొద్దుట్నుంచీ మధ్యాహ్నం దాకా తిరిగాడు గడ్డివాములు, చొప్ప

## రూ. 600 లు బహుమతి పొందిన కథ

వాముల్ని, పిడకల కుప్పలు ఏవేవో చాలా గాలించాడు. సీలూ ఎక్కడా కనపళ్లేదు.

బుచ్చికి భయమేసింది. బాధేసింది. చచ్చిపోదామని కూడా అన్పించింది.

చివరికి ఏడీతో వక బావి దగ్గరి కెళ్ళాడు. చింతచెట్టు కడుపులో కూచుండి ఏడుస్తున్నాడు. చిన్న రాయి తీసుకుని చెట్టుమీద పిచ్చిగా చెక్కాడు. అప్రయత్నంగా పిల్లి [బొమ్మ] కనిపించినట్టయింది. చిన్నగా ఏడ్వటం మొదలెట్టాడు.

చాలా సేపు గడిచింది. తన కోసం ఎవరూ రాలేదు. సూర్యుడు ధైర్యం చెప్పటానికి వెన్ను తడుతున్నట్టు అనిపించింది. చింతచెట్టు తన కన్నీళ్ళు తుడవటానికి కొమ్మల చేతులు వొంచుతున్నట్టనిపించింది.

బుచ్చిగాడి కళ్ళు అలిసి పొయ్యాయి. చిన్నగా నిద్రపట్టింది.

బుచ్చిగాడికి నిండా కొడితే ఏడెనిమిదేళ్ళు కూడా ఉండవ్. ఎర్రగా మేడిపండులా ఉండకపోయినా నల్లగా బొగ్గులా మాత్రం ఉండడు. అయినా అందరు 'క్రోడా' అనే ఎగతాళి చేస్తారు. పళ్ళు అసహ్యంగా లేకున్నా, ముఖం భయంకరంగా లేకున్నా కాళ్ళు వెనక్కి లేకున్నా యింటో వాళ్ళు 'దయ్యమా' అనే పిలుస్తారు. అందుకె వాళ్ళంటే కసి వాడికి. అసలు - మనుషులంటే, వాళ్ళ అలికిడంటే, అరువుతెమ్ముకున్న వాళ్ళ మాటలంటే, అతికించుకున్న వాళ్ళ ప్రేమలంటే 'బుచ్చి'కి విపరీతమైన కసి.

పచ్చ్చుమని స్నానం చేయించే దిక్కెవరూ లేనందుకు వాడు దుమ్ముగొట్టుకుని దుమ్ములో తేలి దుమ్ములాగే ఉన్నట్టుంటాడు. చింపిరా చినిగిన నిక్కరు - దానికి పొడుగాటి రెండు నాడాలు - అవి ఆ భుజం మీంచొకటీ, ఈ భుజంమీంచొకటి అడ్డంగా పాకి వీపుమీద, పొట్టమీద రెండు 'క్రాస్' గుర్తులుగా మారి ముందు నిక్కరు పట్టీలకు ముడెయబడి ఉంటాయి. అంగీ తొడుక్కోవటం వాడి కెప్పుడూ ఏరుకే లేదు. అందరిలాగే వెంట్రుకలు పొత్తుగానే వున్నా వాటి మధ్య పిలకముడి సన్నగా వేలాడుతూ ఉంటుంది. క్రాఫ్‌లో పిలక చాలా వికారంగా ఉంటుందనీ, దాన్ని కత్తిరించమనీ 'బుచ్చి' ఎంత మొత్తుకున్నా వాళ్ళింటివాళ్ళు వినలేదు. యముడాలరాజేశుని మొక్కు తీర్చాకకాని, దాన్ని కదపటానికి ససేమిరా వీల్లేదంటారు. ఆ పిలకే వాడి చుట్టూ ఉండే పిల్ల జనాలకు వికారంగా ఉంది. పిలకముడి పీకుతూ వేళాకోళమాడేవారు. అందుకే - బుచ్చివాళ్ళెవరితోనూ కలిసుండే వాడు కాదు. ఏ ఒక్కరితోనూ స్నేహం చెయ్యాలని కిష్టపడలేదు. ఊరవతల బావి దగ్గరి చింత చెట్టు కింద ఒంటరిగా గడిపేవాడు పొద్దంతా.

బుచ్చి వాళ్ళది మిడిల్ క్లాస్‌లో లోయర్ స్టెప్ రైతుకుటుంబం. వాళ్ళవంశంలో పెదనాన్నకి తప్ప ఎవరికీ చదువు అంటలేదు. బుచ్చి తల్లి తండ్రులకు జీవితమంటే కష్టపడటం పండించటం సంపాయించటం తప్ప అంతకు మించినవీ ఎంతో విలువైనవి ఉంటాయనితెలియదు. బుచ్చి వాళ్ళ అక్కకి అంతకన్నా తెలీదు. ఫలితంగా బుచ్చి కోరుకునేది వాళ్ళ ముగ్గురిలోనూ దొరకలేదు.

నాలుగేళ్ళప్పుడే బుచ్చిని గాడా స్కూలుకి పంపారు. మొదట్లో స్కూలుకి వెళ్ళటం, పిల్లలతో కలిసి గెంతటం, ఆడటం బాగానే అనిపించింది. మాష్టారు మీద కూడా మహా ఇష్టంగా ఉండేది. అక్షరాలు దిద్దటం, అందరికన్నా ముందుగా రాసి అప్పచెప్పాలని పోటీ పడటం - ఏడాదిముందే స్కూల్లో చేరిన సుందరం గాణ్ణి దాటేసి కొత్త అక్షరాలు పెట్టించుకోటం - కబడ్డీ ఆటలో లావుగా ఉండే రాజుగాణ్ణి కాలుబట్టి లాగటం భలే గమ్మత్తుగా ఆనందంగా అనిపించింది.

రాను రాను పిల్లలందరికీ బుచ్చిగాడి మీద వాడి చురుకుదనం మీద ఈర్ష్య మొలిచింది. మెల్లగా ఎగతాళి చెయ్యటం మొదలెట్టారు. పిలకతో - పిచ్చి పిచ్చి పేర్లతో పరిహాస మాడటం తనకు భరించరానిదై పోయింది. అయినా - మాష్టారు మెప్పులు వీటన్నిటినీ అధిగమింప జేసాయి.

ఓరోజు మాష్టారు ఆప్యాయంగా పిలిచారు. తన తెలివితేటల్ని ఆకాశాని కెత్తాడు. పొగిడాడు పొంగించాడు. అసలు విషయము మెల్లగా బయట పెట్టాడు. బాపు నడిగి మొక్కజొన్న కంకులు తీసుకు రమ్మన్నాడు బుచ్చిగాడికి మాష్టారు మీద బాగా కోపం వొచ్చేసింది.

ఇంటో అడగలేక, మాష్టారి కోరిక తీర్చలేక వారం రోజులు స్కూలుకి వెళ్ళకుండా తప్పుకు తిరిగాడు. ఎనిమిదోనాడు స్కూలుకి వెళితే మాష్టారు. ఏదో నెపం పెట్టి కొట్టిన దెబ్బలు బుచ్చిగాడిని చదువు నుంచే దూరం వేశాయంటే అతిశయోక్తిలా కనిపించినా పచ్చి నిజం అది.

అప్పట్నుంచి ఇంటో తెలియకుండా స్కూలుకి ఎగ్గొట్టడం మొదలెట్టాడు. ఏ పనీ వచ్చక, ఎవరితోనూ కలవక 'ఏకాకి'గా



# హృదయం

తిరిగేవాడు. సరిగ్గా ఆ సమయంలో ఏలాగైతేనేం బుచ్చి జీవితంలోకి ఓ పిల్లి ప్రవేశించింది. కొట్టొచ్చినట్టుండే నల్లటి మచ్చల్తో భీకరంగా వున్నా అతి దీనంగా వుండేవి దాని కళ్ళు, చూపులు. కాళ్ళూ మెడమీద తెల్లగానే వుంది. అయినా, దాన్నెవరూ పిలిచి పిడికెడెయ్యలేదు. అదే బలవంతంగా అంటి పెట్టుకుని ఉండేది. అక్కయ్యకు ఆపిల్లి అంటే అసహ్యంగా ఉండేది. బుచ్చిగాడికి కూడా మొదట్లో ఆ పిల్లి ఆకర్షించనే లేదు. అప్పుడప్పుడు విసుక్కుని రాయితో కొట్టేవాడు. ఒకోసారి తన బతుకూ దాని బతుకూ ఒకలాగే అనిపించి కాస్త జాలి పడేవాడు కూడా.

ఓ రోజున ఓవింత సంఘటన జరిగింది.

ఎవరో చిన్న పిల్లాడు 'కర్రోడా' అని పిలుస్తూ బుచ్చిగాడి వెంట పడ్డాడు. చిన్న చిన్నగా రగుల్కొని కోపం మండిందేమో వాణ్ని దొరక బుచ్చుకుని తల వొంచి వీపులో దబదబా గుద్ది ఇంట్లోకి పరిగెత్తుకొచ్చాడు. వచ్చేసరికి అవ్వ బావి కాడికి వెళ్ళినట్టుంది. పక్కన అరలో చప్పుడైంది. అక్క వంటింట్లో ఉందేమో. ప్రశాంతంగా నిశ్శబ్దంగా వుంది ఇల్లు. చప్పుడైందని భయం భయంగా తలుపు తీసి చూశాడు పిల్లి చిలక మీదికి దూకిందేమో చప్పుడైనట్టుంది. పిల్లి నోట్లో చిలక వేలాడుతూ వుంది. మూతినించి నెత్తురు కారిపోతుంది. చూస్తుంటే బుచ్చిగాడి మనసు ఉడికి పోయింది.

వెంటనే పిల్లిని కౌగలించు కుందామనిపించింది. పిల్లి గొప్పపని చేసిందనిపించింది. మెచ్చుకోవాలని అందుకోబోయాడు. పిల్లి పరిగెత్తింది.

బుచ్చికి అప్పటినుంచి పిల్లి అంటే అభిమానం!

దానికీ, తన బతుక్కీ ఏవో సామ్యాలు కల్పించుకుని పిల్లిని దగ్గర చేసుకోవటం మొదలెట్టాడు. తను తినేప్పుడు దాని కొంత పెట్టటం— ముద్దుగా 'నీలూ' అని పిలిచి దాన్ని తినమనీ తనూ తినటం అలవాటుగా చేశాడు. రాను రాను అదో అనుబంధంగా మారిపోయింది.

ఆ మధ్యే బడికెళ్ళటం లేదని పసికట్టి బుచ్చిగాడి బాపు కర్ర తీసుకుని బాదాడు. బాదుతూనే బడిదాకా తీసుకెళ్ళాడు. అయినా—స్కూల్లో ఇముడలేక పోయాడు. ఆ రోజు అన్ని దెబ్బలు పడ్డా అక్క, అవ్వ ఎవ్వరూ దగ్గరికి తీయలేదు పిల్లి దగ్గరికి వొచ్చి నాకుతూ నిమిరింది. ఎంతగా దాని మనసు పంచిందో హాయిగా అనిపించింది. చచ్చిపోయిన నాయనమ్మ అప్పుడు కాసేపు కావడం పెట్టింది.

ఆ తర్వాత ఇంటి మీద అలిగి చింత చెట్టు కిందే రెండ్రోజులున్నప్పుడు పిల్లే తోడుగా ఉంది. అసహాయ స్థితిలో బాధ పడుతూ సానుభూతిగా తనపక్కే కూచుంది. ఆనాడు దాని మనసుగురించి ఆలోచిస్తుంటే 'నీలూ' అని పిలవాలనీ, దాంతో 'దోస్తీ' చేయాలనీ ఏమేమో అనిపించింది. రోజురోజుకూ దాని గుణం చేష్టలు మరింత నచ్చుతూ వొచ్చాయి.

---

## చప్పుళ్ళ వల్ల రక్తపు పోటు

పట్టణాలలో నివసించే ప్రజలు, ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు ఎక్కువ కాలం అధికశబ్దాల మధ్యకాలంగడుపుతుంటారు పల్లె సీమలలోవుండే ప్రశాంతత పట్టణవాతావరణంలో లోపిస్తుంటుంది అనేక వాహనాల శబ్దాలు, యంత్రాల కలిగించే శబ్దాలు మనుష్యులలో చెవిటితనాన్ని కలగ చేస్తాయని యింతకుముందే కనుగొన్నారు ప్రస్తుతం యీ శబ్దాలు మనుష్యులలో అధిక రక్తపుపోటు కూడా కలుగచేస్తాయి. వీటివలన గుండె జబ్బులుకూడా రావడానికి అవకాశంకలదని పశ్చిమ బెర్లిన్‌లోని ఫెడరల్ హెల్తు ఏజెన్సీవారు కనుగొన్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థవారు కూడా దీంతో ప్రాముఖ్యతగల యీ ఫలితాలను పరిశీలిస్తున్నారు. ఎక్కువ శబ్దాల మధ్య పని చేసే కార్మికులు వారి ఆరోగ్యానికి భంగం కలగకుండా వుండడానికి 'హెడ్ ఫోన్స్' అనబడే ప్రత్యేక సాధనాలను వాడుతున్నారు. వీటివలన ఆ శబ్దాలు కార్మికులకు ఎక్కువగా వినిపించవు. ఆ విధంగా కార్మికులలో ఏర్పడే అసాధారణ అనారోగ్య పరిస్థితులను కొంత వరకు అరికట్ట వచ్చును.

అవ్వ రెండ్రోజుల్తర్వాత చింతదగ్గరి కొచ్చి బతిమాలింది తనని ఇంటికి తీసుకొచ్చింది అదీ ముసలిదాని బాధ పడలేక చేసారని బుచ్చిగాడికి తెలియదు. ఇంట్లో వాళ్ళమీదా కొంచెం కొంచెం ఇష్టం అనిపించింది. అదీ ఎన్నోరోజులుండలేదు. ఆ రోజు రాత్రి తను పడకుని నీలాతో ఆడుకుంటున్నాడు. అది తననూ, తను దాన్నీ బులిపిస్తున్నాడు.

'బుచ్చీ' అని పిలిచాడు బాపు.

తను వెళ్ళాడు. దగ్గరకు తీసుకుని ఆప్యాయతనంతా వెళ్ళపోశాడు. మామంచి 'బుచ్చీ' అని వీపు నిమిరాడు. 'కాళ్ళు లాగుతున్నాయి. కాస్త తొక్కరా' అన్నాడు. తొక్కటం మొదలెట్టినా మనసు అనేక విధాలుగా పోతోంది. పిలిచి తొక్కమంటే కోపం వచ్చేదికాదు. కాసేపు మెచ్చుకుని పొంగించి చెబితే కోపం వచ్చింది. వీందుకో ఆ అడగటంలో స్వార్థం కనిపించింది. తెచ్చిపెట్టుకున్న ప్రేమ కనిపించింది. బుచ్చిగాడి ఆలోచన్లు విపరీతంగా ఉన్నాయి. అవ్వ అలాగే చేసింది. చాలా సార్లు పిలుచుకుని పప్పులు పెడతానని ఆశ పెట్టేది. సాకలోళ్ళింటి కెళ్ళి చీర ఉతికిందేమో తెమ్మనటమో, కుమ్మరోళ్ళింటికెళి తుంటు పోసుకోను 'మన్ను' అడక్కు రమ్మనటమో చేసేది పని చెప్పటం తప్పనిపించకపోయినా ఆశపెట్టటం- ఆప్యాయత చూపటం అంతా వాళ్ళ అవసరాలకే వచ్చేట్టుందేది. అక్కయ్యా అంతే. అంతా అంతే అందరిలో అదే గుణం. మనుష్య జాతిలోనే ఉంటుందేమో- పిల్లిలో అదేదీలేదు.

అందుకే- నీలా కోసం తనేమైనా చేస్తాడు. నీలా పొగడదూ, పొంగించదు. అవసరానికి ఆప్యాయత నటించదు. నీలా అంటే అంత ఇష్టమ్మరి.

బుచ్చి వేడిపించాలంటే ఎంత సులభమో ఆ ఊరందరికీ తెలుసు. 'నీలా'ని ఏ చిన్నగా హింసించినా తను బాధపడేవాడు. అక్కయ్య నీలాని చాలా సార్లు దాచేసి ఏడిపించేది తనని. వీళ్ళందర్నీ కాదనీ ఒక పిల్లిని అంత ఆరాధించటం ఎవరికీ ఇష్టం లేదు ఓసారి- కావాలని వాళింట్లోవాళ్ళే తన నీలాని దాచారు. ఆ రోజంతా ఏడుపే- ఉపవాసమే.

ఎవరో తడుతున్నట్టయి అత్రంగా లేచాడు బుచ్చి. పొద్దు బారెడుంది. దిగాలు పడ్డట్టు కళ్ళు నలుముకుంటూ చూశాడు. ఎదురింటి మంగడు. తనని ఎప్పుడూ ఏడిపించటానికే ప్రయత్నించి ఈ రోజు వాడూ ఏడుపు ముఖం పెట్టాడు. గొంతు మెల్లగా బొంగురుగా పలికింది.

"చంపేసింద్రు" అన్నా బుచ్చి ఏమీ పలకలేదు

"నీ నీలుని చంపేసింద్రు."

ఏమీ తోచలేదు బుచ్చిగాడికి. అర్థం కాలేదేది. చెవులు బద్దలౌతున్నట్టు, కళ్ళు మంటలు తున్నట్టు అనిపించింది.

"ఎవలు" గర్జించాడు మెరపులాగ.

"దొమ్మరోల్లు"

"యాడ"

"గా మాదిళిండ్లవతలున్నరు ఏక్కణ్ణుం చొచ్చిందో ఏమో పొద్దుగాల్నే మీ నీల మా చొప్పలకింద దాక్కుంది. అది దొమ్మరోల్లు జూసింద్రట పట్కపోయింద్రట. రెండు జాములకు మా అవ్వ జెప్పింది. నేనూ మైసడు దొమ్మరి గుడిసెల కాడికి పోయినం. ఏం గన్పించలే. వాళ్ళు పిల్లుల్ని కోస్కోని తింటరట. మీ పిల్లిని కూడా చంపోకని తినొచ్చు."

బుచ్చికి మాట రాలేదు. నోరు పడిపోయింది. అణువణువూ ఏదో రకంగా ఏడుస్తున్నట్టు కసితో వూగిపోతున్నట్టు అనిపించింది. పండ్లు పగతో ఉక్కిరిబిక్కిరవుతున్నాయి.

పరిగెత్తాడు బుచ్చి.

దొమ్మరి గుడిసెల్లేవ్. మంగడు చూపించిన చోట ఏ గుడిసెలూ లేవు.

వాళ్ళు భోజనాలు చేసి మకాం ఎత్తేశారని చెప్పారు పక్కనున్నవాళ్ళు.

చూస్తూ బుచ్చి దీనంగా నిలబడ్డాడు. నీలా అరుస్తున్నట్టనిపించింది. దొమ్మరోళ్ళమీద కసితీర్చుకోవాలనిపించింది. పరిగెత్తబోయాడు. కాలికి ఏదో తగిలినట్టయి కిందికి చూశాడు. నీలా కాలికి తను కట్టిన ఎర్ర గుడ్డపేగూ, కాలి చివర్లు చెవులూ, తోక, చిన్న చిన్న భాగాలు కొన్ని ఉన్నాయక్కడ. అవి ఖచ్చితంగా 'నీలా' వేనని గుర్తుపట్టాడు. దోసిట్లోకి తీసుకుని అన్నిట్నీ కళ్ళకద్దుకున్నాడు. ఎక్కరు మూలన మడిచాడు.

బుచ్చిగాడి హృదయం తల్లడిల్లిపోతోంది.

తన ప్రేమకూ ఆత్మీయతకూ ఏలా రూపం పోయాలో తెలీలేదు.

సంఘర్షణలో వోడి తిరిగి పోతున్నాడు.

ఛక్కుని నాయనమ్మ చావు మెరిసింది మనసులో.

అంతే!

బొందలగడ్డకు నడిచాడు. చిన్న చిన్న కట్టెపుల్లలు ఏరుకొచ్చాడు. నాయనమ్మ సమాధి పక్కన కాడు పేర్చాడు. 'నీలా' మిగిలిన భాగాల్ని అందులో వేశాడు. మట్టు తిరిగి నిప్పంటించాడు.

అక్కడే ఏడుస్తూ నించున్నాడు బుచ్చిగాడు,

కాష్టంలోంచి పిల్లి లేచొస్తుం దన్నట్టు—!



సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలాజనార్దన్

తులశమ్మ గదిలోకి అన్నం తీసుకెళ్ళినప్పుడు "విన్నావమ్మా, నా కొడుకు ఈ ఇంట్లో ఉండకూడదట. ఇది దానికి స్వంతంగా పుట్టిన బుద్ధి కాదు ఆ జానకి మహాతల్లి నేర్పించింది చూసేందుకు ముచ్చు. యెంత నంగనాచిదో.." అంటూ మొదలుపెట్టిన మాటలు వినలేకపోయింది.

"చేసినంతకాలం చేశారు. పిల్లల్ని పెంచి పెద్ద చేసి విద్యా బుద్ధులు చెప్పించారు. ఇక మీకిప్పుడెందుకు ఆరాటం! మంచి చెడు వాళ్ళు చూసుకుంటారు మీరు దిగులు పడాల్సినంత చిన్న వయసులో లేరు పిల్లలు. మీరు వైద్యానికి మందులు ఆహారం తీసుకుంటూ హాయిగా వుంటే తొందరగా ఆరోగ్యవంతులౌతారు." అంది.

"అనుభవించే వాళ్ళకు తెలుస్తుందిగాని ఇతరులకేం తెలుస్తుంది బాధ?" నిట్టూర్చింది తులశమ్మ.

*(గత సంచిక తరువాయి)*

ఆ సాయంత్రం కామాక్షమ్మ ద్వారా ప్రొద్దున జరిగిన గొడవ తెలుసుకొని బాధపడింది శాంతి.

"యేమిటో ప్రతి విషయంలో జానకిని ఇరికిస్తారు." అనుకుంది.

"మీ తమ్ముళ్ళ ఉద్యోగ విషయంలో జోక్యం కలిగించుకొని జానకిని అనవసరంగా బాధ పెట్టాను" ఆమె బాధ డిస్పెన్సరీకి వెళ్తున్నప్పుడు మనోహర్‌తో చెప్పినప్పుడు గాని తగ్గలేదు.

"అనుకోకుండా జరిగేవాటికి మనమేం చెయ్యగలం? కాని ఇలాగే జరుగుతుంటే జానకి ఆరోగ్యం మరింత దిగజారుతుందేమోనని భయంగా వుంది." దిగులుగా అన్నాడు మనోహర్

శాంతికి తళుక్కున మెరుపులా తోచింది ఆలోచన.

"మీరోసారి చెప్పండి కొద్ది రోజులు సెలవు పెట్టి ఆమె నెక్కడికైనా తీసుకెళ్ళండి స్థలం మార్పువల్ల మనసుకూడా కుదుట పడొచ్చు"

అతడికా సలహా బాగా నచ్చింది కాని డిస్పెన్సరీ విషయమే ఆలోచనగా వుంది. 'ఇక్కడాపివేసి వెయ్యడం కష్టం. మూసేస్తే'

'మూసివెయ్యడమా" ఒప్పుకోలేదు శాంతి ఇప్పుడామెకు ప్రతి పైసా యెంతో విలువైనదిగా కనిపిస్తోంది

"డాక్టర్ విష్ణువర్ధన్ క్రొత్తగా కర్నూలు నుండి ట్రాన్సఫరై వచ్చారుగా. అతడ్ని పిలుద్దాం"

మనోహర్ ప్రయాణ విషయం చెప్పినప్పుడు, వెళ్ళాలా? వద్దా? అని ఆలోచనలో పడ్డది జానకి.

ఆమెకూ కొద్ది రోజులు మార్పు కావాలనే అనిపిస్తున్నది

కాని దీనివల్ల మళ్ళీ ఇంట్లో యెంత గొడవ జరుగుతుందోనని భయం

"నా మాట కాదనడానికి వీల్లేదు నువ్వు రాకపోతే ఒప్పుకోను" కాస్త కోపంగా అన్నాడు మనోహర్

"అదికాదండి .." యేదో చెప్పబోయిన ఆమెను మధ్యలోనే వారించాడు.

"ఇంట్లో పరిస్థితులెప్పుడూ వుండేవే. ఇక నువ్వేం అడ్డు చెప్పకు." శాసించినట్లే అన్నాడు.

"ఇంత తెగింపు తనకిదివరకే వుంటే యెంత బాగుండేది" ఆ తర్వాత తనలో తనే చాలా సార్లనుకున్నాడు

శాంతి వాళ్ళ ప్రయాణానికి కావల్సిన యేర్పాట్లు చేస్తుంటే అందరూ వింతగా చూస్తున్నారు

"కాస్త ఒళ్ళు బాగ లేకపోతే యే బెంగుళూరో, కాశ్మీరో తీసుకెళ్ళే మొగుడు అందరికీ దొరుకుతాడా?" లలిత, సుమిత్ర కినుకుగా అనుకున్నారు.

"ఇన్నాళ్ళూ మంచంలో పడివున్న తల్లిని పట్టించుకోలేదు. తింటూ తిరుగుతున్న పెళ్ళానికేదో రోగమని బెంగుళూరు తీసుకెళుతున్నాడు." తులశమ్మ బాధ వర్ణనాతీతం.

"జానకీ, మీరేం మాటలేమి పట్టించుకోవద్దు." చాలా సార్లు చెప్పింది శాంతి.

**జరిగినకథ 9** లోటి డాకర్లు, కొడుకు విజయ్ బలవంతము చేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తుకొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ళ ఇంటికి వెళ్తుంది అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూచిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతము ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళి చేసుకొంటాడు మనోహర్. కట్నం రాలేదనీ, తమ కొడుకుకి అత్త వారింట జరగవలసిన ముచ్చటు ఏవీ జరపలేదనీ మనోహర్ తల్లిదండ్రులు జానకిని హింసిస్తారు భర్త మనసు అర్థం చేసుకున్న జానకి సహకారంతో శాంతి, మనోహర్‌ల వివాహం జరుగుతుంది. జానకితో కల్సివుండటానికే నిశ్చయించుకొని మనోహర్ ఇంటికి వచ్చేస్తుంది శాంతి ఆ ఇంట్లో జానకి ఒక్కతే, ఆరోగ్యం సరిగ్గా లేకపోయినా అన్ని పనులూ చేయటం చూసి సహించలేక కామాక్షమ్మను పని మనిషిగా నిర్ణయించుతుంది శాంతి. అది చూసి ఒక్క శివయ్య తప్ప అందరూ అసూయ చెందుతారు. జానకితో శాంతి కలిసి మెలిసి ఉండటం చూసి తులశమ్మ బాధపడి, జానకిని దూషిస్తుంది.

"విజయ్, స్వర్ణ విషయం దిగులు పడకండి"

"నా కంటే బాగా చూసుకొనే వీవుండగా, వాళ్ళ గురించి నాకేందిగులు?" అంది జానకి వెళ్ళిన వాళ్ళతో పాటే వెళుతున్నది

* * *

జానకి, మనోహర్‌ను ట్రైనెక్కించి వచ్చిన తర్వాత యేవేవో ఆలోచనలు చెలరేగుతున్నాయి శాంతికి పరీక్ష వ్రాయబోయే విద్యార్థి మనసులా వుందామె మనసు.

'తను చెయ్యాలనుకున్నది చెయ్యగలదా?'

తెల్లవారిన తర్వాత మామూలుగా తన పని తను చేసుకుపోతున్నది.

విజయ్, స్వర్ణలను నిద్రలేపి వాళ్ళ స్నానాదులన్నీ అయిన తర్వాత, తనతో పాటే వాళ్ళమా టిఫిన్‌కు కూర్చోపెట్టుకుంది. ఆ ఇంట్లో వాళ్ళ విషయం మరెవ్వరూ శ్రద్ధగా పట్టించుకోరని ఆమెకు తెలుసు

హాస్పిటల్‌కు వెళ్ళేముందు అలవాటుగా అత్తగారిని చూసేందుకు వెళ్ళింది.

మూర్తి, చంద్రం కూడా అక్కడున్నారు.

అత్తగారికి ఇంజక్షన్ చేస్తూ "ఇంట్లో వ్వరేపేదూ!" అంది.

మూర్తి, చంద్రం ముఖాలు కోపంతో వీరబడడం ఆమె చూడక పోలేదు.

"మావిషయం మీకనవసరమని చెప్పాను" అన్నాడు చంద్రం.

సిరంజ్ తీస్తూ వాళ్ళవైపు చూసి నవ్వింది.

"అనవసర మనుకుంటే నష్టం యెవరికి?"

"బెదిరిస్తున్నావా?"

"లేదు మీలో మార్పురాదేమోనని భయపడుతున్నాను." సూటిగా చూసింది.

"వుద్యోగం చెయ్యడం మాకిష్టం లేదనుకుంటున్నారా?"

"లేదు. వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకుండా మంచి అవకాశం కోసం యెదురు చూడమంటున్నాను."

"అంటావు తల్లీ. ఇలా అనేందుకేగా ఆ మహాతల్లిని కోరి నిన్ను మొగుడికి చేసుకున్నది. యెల్లకాలం మీ సంపాదన తింటూ వుండరు. వాళ్ళ సాక్షేవో వాళ్ళు పడతారు." తులశమ్మ కొరకొరచూపులు



వూహించుకున్నవే కాబట్టి భయపడలేదు శాంతి

"మీరెలా అనుకున్నా, ఏమనుకున్నా పరవాలేదు. యెవరిపాట్లు వాళ్ళు పడక తప్పదు. వాళ్ళపాట్లు వాళ్ళు యెప్పుడో పడడం కాదు. పడేవయసిదే. ఇప్పుడు వాళ్ళను సమర్థించి, వాళ్ళ ముందుజీవితాన్ని నాశనం చెయ్యకండి." అని బయటికి వచ్చింది.

* * *

మనోహర్, జానకి వెళ్ళిన వారం రోజుల్లోనే ఇంట్లో చాలా మార్పులొచ్చాయి.

మూర్తి, చంద్రం తను మళ్ళీ చెప్పకుండానే ఇంటర్వ్యూకెళ్ళి ఆ మర్నాడే వుద్యోగంలో చేరడం శాంతికమిత సంతోషం కలిగించగా, లలిత వాళ్ళ స్కూల్లో పనిచేసే సైన్సు టీచర్ను గుళ్ళో పెండ్లి చేసుకొని రావడం అంతులేని ఆశ్చర్యం కలిగించింది.

అతణ్ణి ప్రేమించిన విషయం ఇంతవరకు సుమిత్రకు కూడా తెలియదు.

"యెంత పాడుపని చేశావే పాపిష్టిదానా!" శివయ్య ఉగ్రరూపం దాల్చాడు. "ముందు బయటికి నడవండి"

"నా కడుపున చెడపుట్టింది..." యేడుస్తూనే అరుస్తున్న తులశమ్మకోపం మెల్లగా పెద్దకొడుకు మీదికి, కోడళ్ళ మీదికి మళ్ళింది వాళ్ళ సుఖ సంతోషాలు వాళు చూసుకుంటూ ఇంట్లో పెంజీ డోవిన

# ప్రేమ పాశం

పిల్లలున్నారని మరిచారన్నది. పట్టించుకొని చేసేవాళ్ళు లేరనే ఆ పిల్ల తెగించిందని, డబ్బు మిగిలిందని సంతోషపడమన్నది.

చుట్టు ప్రక్కల వాళ్ళ కప్పుడే వార్త చేరిందేమో, ఒక్కొక్కరే అక్కడికి చేరబోతుంటే శాంతి తేరుకొని వీధి తలుపులు వేసింది. ఇంత వరకూ తను చూపినది అబద్ధం కాదని ఋజువు చేస్తున్నట్లుగా యేడుస్తున్నది లలిత.

లోపలి నుండి వినిపించే తల్లి యేడుపు, అరుపులు, శాపనార్థాలు, తండ్రి క్రోధమైన చూపులు, వాడియైన మాటలు, అన్నలూ, చెల్లెళ్ళూ అసహ్యం ప్రకటిస్తుంటే పిల్లలు భయంగా చూస్తుంటే, వాళ్ళ ప్రవర్తనకు మాటలకు తప్ప, తను చేసిన పని తనకు బాధ కలిగించడం లేదన్నట్లు, తను పెండ్లి చేసుకొచ్చిన నరేంద్రన్‌కు మరింత చేరువై "పాపం పదండి" అంటూ యేడుస్తోంది.

నరేంద్రన్ అందర్నీ పరీక్షగా చూస్తున్నాడు. అతడు భయపడ్డట్లు కనిపించడం లేదు.

"లలితా, మాట మాత్రంగానైనా యెవరికీ చెప్పలేదే?" దగ్గరగా వచ్చి మెల్లిగా అడిగింది శాంతి.

నరేంద్రన్ నవ్వాడు. "భలేవారే. ముందుగా తెలిస్తే మేము దేవదాసు పార్వతులమై పోతామని మాకు తెలుసు. వాళ్ళకు జమీందారు హోదా అడ్డువస్తే, మాకు కులం అడ్డు నిలుస్తుంది. అందుకే యెవరికీ చెప్ప కూడదనుకున్నాము." లలిత బదులు అతడే సమాధానం చెప్పాడు.

శివయ్య ఆవేశంగా మళ్ళీ యేదో అనే లోగా "లలితా, ఇక్కడి పూజ పూర్తయింది. ఇక మా యింట్లో కావాలి గా. ఇక్కడే ఇంత ఔంబేలు పడితే యెలాగ? పదపోదాం." నరేంద్రన్ బయటికి నడుస్తుంటే, మంత్ర ముగ్ధలా అతణ్ణి అనుసరించింది లలిత.

గంట తర్వాత సుమిత్ర నడిగి నరేంద్రన్ ఇల్లెక్కడో తెలుసుకొని బయలుదేరేవరకు శాంతి మనసు మనసులో లేదు.

అప్పుడే నరేంద్రన్, లలిత ఇంట్లోనుండి బయటికి వస్తున్నారు. వాళ్ళ ముఖాలు ఇదివరకున్నంత బాధగా, భయంగా లేవు. కాస్త ప్రశాంతత చిక్కినట్లుంది.

"యేమిటిలా వచ్చారు? మీరు పెట్టాల్సినవి పెట్ట లేదనా?" గబగబా వస్తున్న శాంతినిచూసి నవ్వుతూ అన్నాడు నరేంద్రన్. ఇందాక ఆమె యేమీ అనకపోవడం అతడికి ఆశ్చర్యం కలిగించింది.

'అతడికెంత ధైర్యం! యెంత చొరవ! అతడి రూపుకంటే అవే లలితను ఆకర్షించాయేమో!' అనుకుంది శాంతి.

"మా ఇంట్లో మీకు జరిగిన అవమానానికి బాధగా వుంది. క్షమించండి" అంది.

"వదినా" కండ్లు పెడల్పు చేసుకొని చూసిన లలిత కళ్ళలో ఆనందం, ఆశ్చర్యం.

"ముందుగా నాకు తెలిసి వుంటే ఇలా జరిగేది కాదు."

"ఔను. జరిగేది కాదు. లలితకు అర్జెంటుగా మరో పెండ్లికొడుకును చూసేవాళ్ళు." అన్నాడు నరేంద్రన్.

"ఇలా రోడ్డు మీద నిల్చొని యెంత సేపు మాట్లాడుకుంటాం. మీ కభ్యంతరం లేక పోతే మా ఇంటికి రండి. క్రొత్త జీవితం ప్రారంభించే మొదటి రోజు మొదటి అతిథి మీరే అవుతారు" నరేంద్రన్ అక్కడి నుండి కదులుతూ అన్నాడు.

"అంటే మీరు..."

"సందేహమెందుకు? ముందాలోచనతో ముందుగానే ఇల్లు మాట్లాడి పెట్టుకున్నాము. నేను ఇంట్లో వుంటే నా చెల్లెళ్ళ, తమ్ముళ్ళ పెండ్లిళ్ళుగావన్నారు. అమ్మా, నాన్న వాళ్ళు పెద్దగా అరిచి గోల పెడితే చుట్టు ప్రక్కల వారందరు నవ్వి పోతారని భయపడి ఆవేశం, కోపం, బలవంతంగా నిగ్రహించుకొని, నెమ్మదిగా చెప్పారు. పరువు ప్రతిష్ఠల కోసం తప్ప కొడుకునే కాదన్న వారి ఔన్నత్యాన్ని మెచ్చి, చెల్లెళ్ళకు, తమ్ముళ్ళకు మంచి సంబంధాలొచ్చే అవకాశం వుంది. ఒకరకంగా నేను వాళ్ళకు మేలు చేసిన వాడి నయ్యాను కదండి..."

"జరగబోయేవన్నీ తెలిసీ యెందుకిలా చేశారు?"

"మిరనేది పెండ్లి చేసుకున్నామనా? చేసుకున్న తర్వాత ఇళ్ళకు రావడమెందుకనా? చేసుకొనే ముందు ఇంట్లో వాళ్ళకు

చెప్పలేదనా ?" అంటూ ఆమె వైపు చూశాడు.

"చివరి ప్రశ్నకు ముందే జవాబు చెప్పాను. చెప్పకున్నా మీరు తెలుసుకోగల రనుకోండి. ఇక మిగతా రెండు ప్రశ్నలకు సమాధానాలు: ఒకరినొకరం ఇష్టపడి కలిసి బ్రతకాలను కున్నాము గనుక పెండ్లి చేసు కున్నాము. మేము ఇకముందు నిర్భయంగా, హాయిగా వుండాలంటే ఈ ఒక్కరోజు బాధ పడక తప్పదు. పెద్దల తిట్లు, శాపనార్థాలే మాకాశీర్వాదాలౌతాయి. ఇప్పుడిలా జరక్క పోతే, నలుగురూ మా గురించి అసహ్యంగా చెప్పుకోడం, యెవరేమను కుంటున్నారోనని లోలోపల కుమిలిపోవడం జరిగి, మాలో ప్రేమ నశించి విడాకులు మొలకెత్తే అవకా శం వుంటుంది. ఆ బ్రతుకు దుర్భరం. ఫినిష్. జరగవలసినవన్నీ జరిగాయి. రోజూ ఈ మాటలనరుగా."

మాట్లాడుతుండగానే ఇల్లు వచ్చింది.

రెండు గదులైనా నీటుగా వుంది. రెండు గ్లాసులు, చెంబు, ఫ్లాస్కు, మంచం, పరుపు తప్ప సామానేమి లేవు.

"పరిస్థితి చూసి కొందామని యేమీ కొనలేదు. ఇవైనా మా ఫ్రెండ్స్ ఇచ్చినవి." అని చెప్పాడు నరేంద్రన్.

"కూర్చోండి మా పెండ్లి రోజు వచ్చిన మీకు ఆతిథ్యం గొప్పగా ఇవ్వకున్నా, కాఫీ అయినా తీసుకొస్తాను." అంటూ ఫ్లాస్కు పట్టుకొని బయటికి వెళ్ళాడు.

# ప్రేమ పాశం

"లలితా, నరేంద్రన్ చాలా తెలివైన వాడు. మంచి సెలక్షన్ నీది. కాస్త ఒళ్ళు బాగా లేకపోతే బెంగుళూరో, కాశ్మీరో తీసు కెళ్ళే మొగుడు అందరికీ వస్తాడా అన్నావు. నీకసలలాంటిపరిస్థితే రానివ్వడు నరేంద్రన్" అంది శాంతి.

లలిత ముఖం చిన్నబోయింది.

"ఛా, నిన్ను దెప్పడం లేదు. నీ భర్త మంచితనం చెప్పాను. నీవు సంతోషంగా వుండడమే మాకు కావల్సింది." ఆప్యాయంగా భుజం తట్టింది.

"నీకు కావల్సినవన్నీ తీసుకుందువు గాని ముఖం కడుక్కొని తయారవ్వు" అంది.

"నాకేమి వద్దు. ఆయన కిష్టం వుండదు" అంది లలిత

"అతడికి నేను చెప్తాను. నా తృప్తి కోసం మీరు తీసుకోవాలి." బలవంత పెట్టగా ముఖం కడక్కొనేందుకు వెళ్ళింది.

మరో పది నిముషాలకు నరేంద్రన్ కాఫీతో పాటు పూలు, పండ్లు, రెండు జాకెటు బట్టలు కూడా తీసుకొచ్చాడు

"ఏమిటీ మర్యాదలు ?" అంది శాంతి.

"మర్యాదలు కాదు. మా ఆనందం. ప్రథమంగా వచ్చిన అతిథులు మీరు" అన్నాడు.

శాంతి వాటిని ప్రేమగా స్వీకరించింది.

"నా తృప్తి కోసం నేనిచ్చేవాటిని కూడా మీరు కాదన కూడదు..."

అయిష్టంగానే అంగీకరించాడు నరేంద్రన్.

వాళ్ళకు అవసరమైన సామాన్లు, లలితకు బట్టలు కొనిచ్చిన తర్వాత యెంతో తృప్తిగా వుంది శాంతికి.

"ఈ రోజు మీకు ఇంట్లో విందు భోజనం పెట్టలేక పోయాను హోటల్లో నైనా ఇవ్వనివ్వండి" అంటూ ఖరీదైన హోటల్‌కు తీసుకెళ్ళింది. వాళ్ళతో పాటు భోజనం చేసి టైం చూసుకుంటే తొమ్మిది గంటలు కావస్తోంది.

"అరె, అప్పుడే ఇంత టైం అయిందా? డిస్పెన్సరీ మూసే వేళయింది" స్వగతంగా అనుకొని "మళ్ళీ కలుస్తాను." లలితకు, నరేంద్రకు చెప్పి గబగబ బయటికి వచ్చింది.

శాంతి వచ్చేసరికి ఇంకా పేషెంట్లు వున్నారు.

"సారీ, డాక్టర్. మిమ్మల్ని చాలా శ్రమ పెట్టాను."

"చేసే పనే ఇదయితే శ్రమేముంది ?" చిరునవ్వుతో సమాధానం చెప్పాడు విష్ణువర్ధన్. అతడు అంత సేపుగ పని చేస్తున్నా ముఖంలో విసుగు కనిపించడం లేదు.

అరగంట వరకు వూపిరి పీల్చుకొనేందుకు కూడా వీలులేక పోయింది ఇద్దరికీ.

పేషెంట్లందరూ వెళ్ళిపోయాక శాంతి సాయంత్రం జరిగిన సంఘటన చెప్పింది. "అందుకే ఆలస్యంగా వచ్చాను" అంది.

"మరేం పరవాలేదు. మీరిలాంటి పరిస్థితిలో ఇప్పుడు రావడం కూడా విశేషమే" అని "అయినా ఆ పెండ్లి గురించి పెద్దగా ఆలోచించనక్కర్లేదు. కోరి చేసుకున్నారు. పెద్దవాళ్ళెప్పటికైనా పిలుస్తారు. ఈ రోజన్న కోపం రేపుండదు. వాళ్ళు పిలవకపోయినా నష్టం లేదు. అసలు ఉమ్మడి కుటుంబాలలో బోలెడు కలహాలు." దిగులుగా వున్నట్లు కనిపించిన ఆమెకు ధైర్యం చెప్పాడు.

డిస్పెన్సరీ మూసి తాళం వేస్తూ "శాంతీ, ఎక్కడ మీరు నర్సింగ్ హోమ్ పెట్టాలంటే డబ్బుకు డబ్బు, పేరుకు పేరు వస్తాయి. అబ్బ! యేమి జనం!"

(39 వ పేజీ చూడండి)





# పెద్దకొడుకు

దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన కథ

ఉత్తరం చదువుకున్న వెంకట్రామయ్యగారు చాలాసేపు అలా ఉండిపోయారు. కొంతసేపయాక తేరుకుని 'ఓయ్, అబ్బాయి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది' అంటూ భార్య గదిలోకి వచ్చారు. 'ఓ, నిద్రపోతున్నావా?' వెనక్కి వెళ్ళిపోయారు.

'లేదండి, అలా మాగన్ను పడిపోయింది.'

'అబ్బాయి ఉత్తరం రాశాడు.'

'అంతా కులాసానా? ఏమన్నాడు?'

లేని బలం తెచ్చుకుని తలగడ నిలబెట్టి నడుం దానికి జేరవేసి కూర్చుంది పేరిందేవమ్మ

'ఏదండీ ఉత్తరం?'

నీరసంతో వణుకుతున్న చేతులతో ఉత్తరం అందుకుని కళ్ళు చిట్లించి ఓ క్షణం చూసి ఉస్సురని నిట్టూర్చింది

'నాకో కార్డుముక్క ఇవ్వండి, రెండు ముక్కలు రాసిపడేస్తాను.'

కార్డు తీసుకుని శ్రీకారం చుట్టబోయిన పేరిందేవమ్మకి కళ్ళు మసక మసకగా అయి చీకట్లు కమ్ముకున్నాయి ఒళ్ళంతా చెమట పట్టేసింది.

'వాడిని రావద్దని రాయండి నా కిప్పుడప్పుడే భయంలేదు మీరే రాసి పోస్టులో పడెయ్యండి'

భార్య మాటలు విని వెంకట్రామయ్య ఆశ్చర్యపోలేదు ఆలోచనలో పడ్డాడు

కడుపున పుట్టిన బిడ్డ వస్తానంటే ఎందుకు కాదంటోందో తనకు తెలియకపోలేదు తల్లి ప్రాణం తల్లి ప్రాణమే అందుకనే చూపించారు ఉత్తరం. రావద్దని రాయమంటోంది తీరా ఏదైనా జరగరానిది జరిగితే ... అభాండం మీద పడితే భరించడం కష్టం కష్టాలన్నిటినీ ఎదిరించవచ్చు — మాటపడటం తనవల్లకాని పని

రమ్మని రాయడం భావ్యం. రావద్దని రాయడమెలా? వస్తున్నానని రాస్తున్న కొడుక్కి రావద్దంటున్న తల్లి మాట ఎలా రాయాలి?

'ఏమిటండీ ఆలోచన?'

మగతమండి మేల్కొని అడిగింది పేరిందేవమ్మ అయినా అది మాటవరస కడిగిన ప్రశ్నే మనసులోని ఆలోచనల్ని ముఖంమీద చదవగలిగిన ప్రజ్ఞ అన్యోన్య దాంపత్యం కొన్ని దశాబ్దాలు సాగించిన తరువాత భార్యాభర్తలిద్దరికీ కరతలామలకమే.

'ఏంలేదు — చిన్నాడు రాసిన ఉత్తరానికి జవాబు...' వాక్యం ఎలా ముగించాలో తెలియక ఆపేశారు.

'నేనెలామా బ్రతకను దగ్గరా, దాపలా? అంత దూరం నుంచి రావడం మాటలా? వచ్చినప్పుడల్లా, శెలవూ, పిల్లల చదువులూ, బోల్డు డబ్బూ దండగ'

ఆరముగ్గిన జీవితానుభవం — నాకంటె నీ తెలివితేటలే ఎప్పుడైనా ఎక్కువ — చాలా జటిలమైన సమస్య దీనికి పరిష్కారం యెంత సులువుగా సూచించింది! రావద్దనే తాత్పర్యమైనా అందులో ఎంత నాజూకుదనం!

వెంకట్రామయ్యగారు తృప్తిగా చిరునవ్వు నవ్వారు.

'అయితే నేనే రాస్తా' రెండు వాక్యాలు రాసి ఆమెవంక చూసి 'పూర్తిచేసి చదువుతా' అన్నారు.

''నువ్ రాసిన ఉత్తరం అందింది. అమ్మ కులాసా. మొన్ననే వచ్చి వెళ్ళావ్ నువ్ వచ్చినప్పటికంటె కొంచెం నయంగావుంది పరిస్థితి పిల్లలకు బడీ, నీకు శెలవూ పోతుంది రావద్దని అమ్మ రాయమంది డాక్టరు మందులు మార్చి రాశాడు. పెద్దాసుపత్రికి కూడా తీసుకెళ్లాను. అదే వైద్యం కొనసాగించమని చెప్పారు

కోడలికీ, పిల్లలకీ ఆశీస్సులు''

రాసిన ఉత్తరం చదివి వినిపించారు వెంకట్రామయ్యగారు. మొదటి వాక్యమైనా వినకుండా నిద్రమగతలోకి జారిపోయింది పేరిందేవమ్మగారు

ఆమెవంక అలా తదేకంగా చూస్తున్నారాయన

'సుగర్ ఎక్కువయితే ఈ నీరసంమీద కోమా వచ్చేస్తుంది గుండెపోటు ఎక్కువయితే పక్షవాతం వచ్చేస్తుంది. మధుమూత్రం, గుండెజబ్బు, రెండూ జతకూడితే ప్రమాదమే ఒకదానికి తిండి పనికిరాదు. రెండోదానికి తినక వీల్లేదు మరేం చేస్తాం మాష్టారూ — జాగ్రత్తగా ఈ మందులు వాడండి పథ్యంగా వుండాలి'

డాక్టరు అయిదేళ్ల నుంచి చేస్తున్న వైద్యమే. నెల నెలకీ, ఈమధ్య పరిస్థితి మరీ అయోమయం అయిపోతూంది. డాక్టర్లు ఎంత మంచివాళ్లయినా, ఎంత చదువుకున్నవాళ్లయినా, వాళ్ళు చెయ్యగలిగిన దానికీ మేరలేకపోలేదు గట్టిగా ఆలోచిస్తే చివరకు జబ్బుకే మందు లేదు కాలం చెయ్యవలసిన పనులు మనిషి కెలా సాధ్యం! వాళ్ల వృత్తి ధర్మం కాబట్టి, తమ కుటుంబంయెడల తనకున్న పేరుప్రతిష్ఠలయెడల ప్రత్యేకమైన

# పెద్ద కొడుకు

అభిమానం వుండబట్టి వివరంగా వున్న సంగతి చెప్పాడాయన

కొన్నివారాల క్రిందట ఆయన సలహామీద పెద్దాసుపత్రికి వెళ్లారు. పరీక్షలన్నీ పేరుపేరునా చేశారు వైద్యంలో విశేషమైన మార్పు లేకపోయినా, పరీక్షలన్నీ పకడ్బందీగా చేసి, జాగ్రత్తగా వుండాలన్నారు

అయితే వాటివల్ల వెంకట్రామయ్యగారిలో ఓ రకమైన ఆశ కలగడం ప్రారంభించింది పేరిందేవమ్మకి మాత్రం తను మళ్లీ ఇంత చేసుకు తినగలననే నమ్మకం పోయింది అలా అలా మంచం ఎక్కినావిడ మూ: నెలల్లో రెండుసార్లు 'సరిసరి' అనిపించేసింది

పెద్దబ్బాయీ, కోడలూ, పిల్లలూ రెండుసార్లు చూసివెళ్లారు. రెండో అబ్బాయీ వాళ్లూ వచ్చి ఓ నెలరోజులున్నారు కొంచెం కులాసాగా వున్నాక తనే వెళ్లమని పంపించేసింది



జ్యోతి చం ••• బి మురళి

పెద్దబ్బాయి దగ్గర నుంచి ఉత్తరం వచ్చిందనుకుని లేని బలం తెచ్చుకుని కూచుంది కస్తూరీ చూడగానే గుండెల్లో రాయి పడింది పేరిందేవమ్మకి

ఆయన ముఖం చూస్తే జాలి కలుగుతోంది ఇద్దరు పిల్లల్నీ ఎలా సాకిందీ తల్లిగా తనకు తెలుసు ఇద్దరియెడలా ప్రేమ వున్నా పెద్దాడిమీద ఆయన ప్రత్యేకమైన ప్రేమ చూపిస్తే తనేమను కుంటుందోనని ఆయన మనసులో మెర చిన్నబ్బాయిమీద ఆయ. ఆపేక్ష చూపించాలని ప్రయత్నం చేస్తున్నారని ఆవిడకీ తెలుసు

'అబ్బాయి ఉత్తరం రాశాడు' అని చెప్పడంలో భావం 'నీ కొ. కు రాశాడోయ్' అని తన కొడుకు దగ్గర నుంచి ఉత్తరం వచ్చిందని చెబితే, తన చిన్నకోడలు వింటున్నాడని తను కొండెక్కినంత సంతోషం పొందుతుందని ఆయన ఉద్దేశ్యం

'పాపం, ఈయన కష్టాల్లోంచి యెలా బైటపడతారో! నాకు వాడిమీదకంటే పెద్దాడి మీదే మమకారం ఎక్కువని ఈయన్ను నమ్మించటం యెలా? అబద్ధాలాడడానికి, కల్లబొల్లి కబుర్లు చెప్పడానికీ కళ కావాలి వీటిని నమ్మనట్టు సూటిగా చెప్పిన నిజాన్ని యెవరూ సులువుగా నమ్మరు' ఆలోచన అలసటతో నిద్ర ముంచు కొచ్చింది పేరిందేవమ్మకి

'పెద్దాడిని పిల్చి ఓ రెండెల్లుండమంటే బాగుణ్ను' ఆరోజు పదోసారి మనసులో అనుకున్నారు వెంకట్రామయ్యగారు 'వాడొస్తే కొండంత బలం వచ్చినట్టుంటుంది వాడే తన బాధ్యతని పంచుకోగల మనిషి కష్టం తెలిసిన మనిషి కాని, కాని అలా తొందరపడకూడదు - పాపం, నేడో, రేపో అని వున్న మనిషి, దానికి కష్టం కలిగించ కూడదు నా విధిని నేను నిర్వర్తించాలి ఒక భార్యను చిన్నవయసులోనే సాగనంపినవాడిని నేనెటూ రాటుదేరిపోయాను' కంటిలోనికి రాని కన్నీళ్లు గుండెలోనే ఆవిరై ఉస్సురని నిట్టూర్చారాయన 'కడుపుతీపి తనకు తెలియనిదికాదు పెద్దాడు దాని కొడుకు కాదు - చిన్నాడు ఇద్దరికీ కొడుకు చిన్నాడు వస్తానంటే లేచి కూచుంటుందనుకున్నాడు — కాని వద్దని రాయమంది వాడి మనసు నొప్పించకుండా ఎలా రాయాలో సూచన కూడా చేసింది' ఆలోచిస్తూన్న కొద్దీ పరిస్థితి వింతగా తోస్తోంది

చిన్నబ్బాయికి రాసిన జవాబు పోస్టు చెయ్యడానికి బయలుదేరారు వెంకట్రామయ్యగారు 'జాగ్రత్తమ్మా, ఆవిడ నిద్రపోతోంది. తలుపు చేరవేసి వెళుతున్నా' అని చెప్పి

మగతలోంచి మేలుకోగానే తలనిండా పేరిందేవమ్మకి ఆలోచనలు

"వెయ్యి రూపాయలు రైలు ఖర్చులు పోసుకుని వచ్చాం మాకేవయినా విలువుందా? మా మాట ఎవరిక్కావాలి? ఏదో ఆయన వెర్రికాని ఆయనకీ, ఆవిడకీ పెద్దకొడుకంటేనే ఇది మనిషి విలువ తెలియని మనుషులు కొంతమందికి కడుపుతీపి కూడా తెలియదు"

చిన్నకోడలు పనిమనిషితో అంటున్న మాటలు వినగానే మనసు పిండినట్లయింది పేరిందేవమ్మకి 'ఇంకా నయం, ఆయన చెవిని బడితే యెంత బాధపడతారో' అనుకుంది 'అత్తయ్యా' అని ఒక్కరోజు నోరారా ఆప్యాయంగా పిలుస్తుందేమోనని ఆశపడింది తను తన వెర్రికాని మేడమీదనుంచి దిగి తన గదిలోకి రావడమే గగనం చిన్నకోడలికి 'జబ్బు మనిషి దగ్గర యెవరో ఒకరుండాలమ్మా, నే వంట చూసుకుంటా! మీరు అత్తయ్యగారి దగ్గర కూచోండి' వాళ్లు వచ్చిన రెండోరోజు అంది బతిమాలుతూ వంటమనిషి

'జబ్బు మనిషి దగ్గర కూచుంటే, ఆయన సంగతి, పిల్లల సంగతి ఎవరు చూసుకుంటారు మందు కావలిస్తే పిలిచినప్పుడు వచ్చి ఇస్తాను కసురుకుంది చిన్నకోడలు

మేడ యెక్కడం మానేసి చాలారోజులయింది పేరిందేవమ్మ రక్తపుపోటు యెక్కువగా వుందనీ, మధుమూత్రంవల్ల గుండె చెడిపోయిందనీ డాక్టరు చెప్పగానే తనకు చేతనయినంతవరకూ జాగ్రత్తగానే వుంటోంది 'ఇంటికి కాపలాగైనా వుంటాను కింద గదిలో వుంటేనే నాకు బాగుంది' అంది భర్తతో

చిన్నకోడలు వైనా మనసులో కలత రేపుతోంది అయినా బయటకేమని ఏం లాభం? కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది

'పిల్లలకీ ఆయనకీ కూడా ఇడ్లీ లేకపోతే వీళ్లేదు పొద్దున్న సాంబారూ ఇడ్లీ లేకపోతే ముఖాలు కడుక్కోరు తండ్రీ, పిల్లలూ, సాయంకాలం పూరీ కూరా తప్పదు మా ఇంట్లో' వచ్చిన రెండవరోజునుంచీ ఊపిరాడని పని అప్పచెప్పేసింది వంటావిడకి

నాలుగురోజులు చూసి భార్యను వెంకట్రామయ్యగారు అడిగారు 'అబ్బాయి అసలు కిందకి దిగడమేలేదు ఒంట్లో బాగులేదా' అని

'వెళ్లి చూడండి' అనాలన్నంత విసుగు వేసింది పేరిందేవమ్మకి కాని కొడుకుమీద కోపం, కోడలిమీద విసురూ భర్తమీద చూపించడం అవివేకమనుకుంది 'నేను కనుక్కుంటా కోడల్ని' అనేసింది

మేడ మెట్ల దగ్గరకొచ్చి కోడల్ని పిలిచింది కోడలైతే పలికిందికాని కిందకొచ్చింది మనవరాలే

'తల్లీ, దా, కూచో'

ఎనిమిదేళ్ళ పిల్ల పంజాబి డ్రెస్సువంకే చూసుకుంటూ గదిలో కొచ్చింది

'మా వూరు బాగుందా, మీ వూరు బాగుందా?' పాప చెక్కిళ్లు గోముగ రాస్తూ అడిగింది పేరిందేవమ్మ

'మా వూరే బావుంది అక్కడయితే ఎంచక్కా టీవీ వుంది ఛీ, ఇదేం వూరు,

ఇక్కడ కరంటు వుండనే వుండదు — గడిగడికీ పోవడమే మా ఇంటి పక్కన పిల్లలూ మేమూ యెంతో బాగా ఆడుకుంటాం మజాగా వుంటుంది '

'స్కూలు పోతోందని అమ్మ ఏమైనా అంటోందా ?'

'రోజూ చదువుకోమంటుంది ఏం చదవం ? పుస్తకాలన్నీ అక్కడొదిలేసి వచ్చాం రెండు రోజుల్లో తిరిగొచ్చేద్దాం అన్నారు నాన్నగారు '

అడిగినదానికి సమాధానం అయితే చెబుతుంది కాని 'మామ్మా' అన్నైనా పిలవలేదు చిన్నది మనస్సు కలుక్కుమంది పేరిందేవమ్మకి

పెద్దకొడుకు పిల్లలయితే క్షణం వదలరు ఇద్దరూ రామలక్ష్మణుల్లా తనదగ్గరే తిరుగులాడుతారు 'మేమిక్కడే చదువుకుంటాం మామ్మా' అని గదిలోనే తను పొమ్మనేవరకూ ఆడుకుంటారు కావలసినప్పుడల్లా, మందులూ, మాత్రలూ, వానిక్కులూ, చెయ్యి కడుక్కోడానికి నీళ్ళూ ఇస్తూనే ఉంటారు

వాళ్ళిద్దరూ వెళుతూ 'వస్తాం మామ్మా' అంటే తనకి కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి బాగా చదువుకోండి బాబూ, ఇదిగో ఇద్దరూ మీక్కావలసినవి కొనుక్కోండి ' చిన్నమనవడి చేతిలో పెట్టుంచింది తను

'అదేవిటత్తయ్యగారూ, వాళ్లకి డబ్బులిస్తారెందుకూ ?' వారించబోయింది కోడలు

'పోన్లేవే, చిన్నవెధవయ్యలు ఉండనీ, ఏ పుస్తకాలో కొనుక్కుంటారు '

'వెళతాం, అత్తయ్యగారూ ! అవసరమైతే కార్డురాసి పడెయ్యండి వెంటనే వస్తాం ' పెద్దకోడలు ఆప్యాయంగా అంది దానితో కొడుకూ అందుకున్నాడు

'అవునమ్మా, దీన్ని తీసుకొచ్చి దిగబెడతా అవసరమైతేనే తిరిగి వెళ్లిపోతా నాకేం ఫరవాలేదు నా వంట నేను చేసుకోగలను దేవుడి దయవల్ల నీ ఆరోగ్యం కుదుటపడితే అంతేచాలు — కాస్త మెరుగ్గా ఉందని తిరిగెయ్యకు వంట మనిషిని మరికొన్నాళ్లుండమను ఇద్దరికయితే మాత్రం అన్ని పనులూ చేసుకోవాలిగా ! మనిషి సాయం ఎలా ఎస్తుంది ?'

'నిజమేరా, చిన్నాడూ రామ్మంటూనే ఉన్నాడు మేడమీద అద్దెకిచ్చేస్తే ఓ వందో నూటయాభయ్యో వస్తుందని ఇద్దరి మనుషులు, ఇంత ఇల్లు ఏం చేసుకుంటారంటాడు, కాని నాన్నగారికి ఇల్లు అద్దెకియ్యడం ఎప్పుడూ ఇష్టం లేదు - నువ్వూ వాడూ వస్తే గదులెలా సరిపోతాయంటారు ఎలాగైనా ఏనాడూ అద్దెకివ్వలేదు ఏవో యీ రోజులు ఇలా వెళ్లిపోతే చాలు ఆ క్షణంకోసం కనిపెట్టుకుని వున్నాను నేను ఆ తరవాతా, మీ యిష్టం '

'అదేంటమ్మా అలా అంటావ్' చిన్నబోయాడు పెద్దబ్బాయి అయినా ఆప్యాయంగా, 'నువ్వేమిటో నిరాశగా మాట్లాడుతున్నావ్ ! నీకిప్పుడేం ఎనభై వచ్చాయా, తొంభై వచ్చాయా ఆ ఎదురింటావిడ చూడు, తొంభై ఏళ్ళుండి తన చేత్తో చేసుకున్న చక్కిలాలూ, చేగోడీలూ, కరకరా నమిలి తింటోంది ఇకపోతే బ్లడ్‌ప్రెషర్లూ అవీ ఈ రోజుల్లో నూటికి అరవైమంది కుండేవే '

'మరో కొన్నాళ్లుంటే బావుంటుందేమోరా' అనాలని నాలిక చివరకొచ్చినా ఆ మాటలు అవిడంటే బావుంటుందని భార్యవంక చూశారు వెంకట్రామయ్యగారు

బాబూ, నువ్వొచ్చి నెలరోజులయింది కోడలు చేత చేయించుకుంటూవుంటే యిలా ఎన్నాళ్ళైనా చేయించుకోవాలనే వుంటుంది అక్కడ పిల్లల చదువులు పోతున్నాయి — ఏదో ఈమాత్రంగా లేస్తున్నానుకదా — ఇంకెన్నాళ్ళుంటారు — వెళ్లండి — అవసరమైతే నాన్నగారు రాస్తారు ' పేరిందేవమ్మ ఉత్సాహంగా మాటాడింది

'అవసరమంటే ఇదేకదమ్మా — మరి తెలవప్పది ఎందుకుండి ? నీ ఆరోగ్యం బాగా మెరుగయ్యేవరకూ వుంటే మంచిదనే నా ఉద్దేశ్యం పిల్లల చదువులకేం — పెద్దచదువులు కావుగా . ఇంట్లో మాష్టారిని ఎలానూ పెట్టావ్, ఆయనే చూసుకుంటాడు '

వెంకట్రామయ్యగారు కలుగచేసుకోవలసిన సమయం వచ్చిందని అన్నారు "నిజమేనే — మరో రెండువారాలుంటే మంచిది ఏమంటావ్?"



'బావుందండీ, ఆడపిల్లలులేని నాకు కూతురిలా చేస్తోంది ఈ కోడలు వాళ్లుండ గాగితే అంతకంటె కావలసినదేవుంది ? అయినా మన స్వార్థం మనం చూసుకోడం అంత బావుండదు '

'అమ్మా, నువ్ అమాటనకు నీచేత పుట్టిన దగ్గరనుంచీ చేయించుకున్నాం — ఓ వారమో, నెలో ఇక్కడ నీకు చేస్తే మనుషులం అరిగిపోతామా . పోనీ దీన్ని వదలి నేను వెళతాను '

తనకిప్పుడు ఒంట్లో బాగా మెరుగ్గా ఉందనీ, వాళ్ల అవసరం అంతగా లేదనీ, పనిమనిషి, వంట మనుషుల సాయంతో కాలక్షేపం చెయ్యగలనని పెద్దకొడుకునూ, కోడలునూ నమ్మించేసరికి చాల శ్రమపడవలసివచ్చింది పేరిందేవమ్మకి

'పెద్దాడు వెళుతూ ఐదొందలిచ్చాడే !' ఆనందంగా చెప్పారు భార్యతో.

'ఇస్తాడని నాకు తెలుసు వాడి మనసు అలాంటిది ' — కళ్ళు తుడుచుకుందావిడ

'ఎందుకా కంటతడి ?'

'ఏం లేదు '

బయటకు కారణం చెప్పకపోయినా తనలో తనే చర్చించుకుంది పేరిందేవమ్మ కన్నీళ్లెందుకో-

'నా కొడుకూ ఉన్నాడు రక్తం పంచుకుని కడుపు చీల్చుకుని పుట్టినవాడు వాడు ప్రేమించి పెళ్లి చేసుకుని ఇంటికి తీసుకొచ్చిన కోడలూ ఉంది ఒంట్లో బాగులేదని రాస్తే వచ్చి ఏదో హోటల్లో విహారానికి వచ్చినట్టు మేడ దిగకుండా- రెండు పూటలా టిఫిన్లూ, కాఫీలూ, పాలూ, బోర్నవిటాలూ అన్నీ మేడమీదకే సరఫరా చెయ్యాలి — ఆయనకొచ్చే పెన్షను చూస్తే ఐదొందలు — ఇన్ని కొంటున్నారు, ఎలా వస్తున్నాయని వాళ్లెవరైనా అడిగారా ? కోడలైతే కొత్త పిల్ల — కొడుక్కు తెలియని నిక్షేపాలేం లేవుకదా — వాడైనా అడగొద్దూ ? — పోనీ డబ్బు మాట దేవుడెరుగు ఆప్యాయంగా ఎప్పుడైనా కోడలూ పలకరించదు — కొడుకు సరేసరి వాడికి పదిహేనొందలు జీతం అని సంబరపడాల్సిందే — 'ఇదిగ ఈ వంద' అని ఒక్కసారి ఇవ్వడు — పైగా కోడలి మెడలో తను చేయించి వేసిన గొలుసేమయిందంటే జవాబు చెప్పడు '

ఉసురుమంది మనస్సు

చిన్నబ్బాయి వచ్చిన రెండు వారాల్లో మరో ఐదొందలు ఖర్చయింది కొడుకుతో డబ్బు విషయం చెప్పడానికి వెంకట్రామయ్యగారికి చిన్నతనం డాక్టర్లకీ, మందులకీ గత రెండు మూడు నెలల్లోనూ సుమారు రెండువేలయిపోయింది చిన్నకొడుకు వ్యవహారం తనకి నచ్చకపోయినా భార్య బాధపడుతుందేమోనని మెదలకుండా వూరుకున్నారు పోనీ జబ్బు మాటెలావున్నా, వచ్చినవాడు తనకి ఆసరాగా వుండడంలేదు ఇంట్లో వున్నంతసేపూ మేడ — లేకపోతే బయట ఎక్కడెక్కడో తిరిగి ఏ రాత్రికో ఇల్లు చేరడం బయట కేమనడానికీ మనస్కరించక లోపల బాధ దిగమింగుకోలేక విలవిల్లాడారు వెంకట్రామయ్యగారు

ఓరోజు మెల్లగా భార్య దగ్గరకు వచ్చి యెలా మొదలెట్టాలో తెలియక కాలుకాలిన పిల్లిలా గదిలోంచి బయటికీ, బయటినుంచి గదిలోకి తిరుగుతుంటే ఆయన చెప్పనవసరంలేకుండానే పేరిందేవమ్మకి విషయం అర్థమైపోయింది

'బ్యాంకులో ఆఖరి ఐదొందలూ అయిపోయినట్లున్నాయి !' ఆవిడే ప్రారంభించింది

'పోన్లే, ఏం చేస్తాం అవసరానికని వుంచుకున్నదేగా '

'మనం ఇప్పుడనుకుని ఏం లాభం ? చదువుకున్నా, వయసొచ్చినా చిన్నాడికి కష్టం తెలిసిరాలేదు కారణం వాడికి మనం చేసిన ముద్దు వాడు ఆడింది ఆట పాడింది పాట నాపేర వేసిన వెయ్యీ తియ్యండి తరవాత భగవంతుడిదే భారం '

'అదికాదే, ఆ డబ్బు తియ్యడమెందుకు ? ఈ ఉంగరం ... ఎలానూ ఇరుకైపోయి చిరాకుగా వుంది '

పేరిందేవమ్మకి కళ్ళలో నీళ్ల తిరిగాయి మొదటిజీతం లందుకుని బంగారం సులువుగావున్న ఆరోజుల్లో అరతులం ఉంగరం చేయించి తెచ్చాడు పెద్దాడు అయితే తన వేలికి బాగా వదులై

# దీపావళి కథలపోటీలో రు. 600 బహుమతి పొందిన కథ

పోయింది 'మీరు పెట్టుకోండి, మీ చేతికి చాలా బాగుంది' తనే ఆయన వేలికి తొడిగింది

'అమ్మా, నేను నీకవి తెచ్చినది నాన్నగారికిచ్చేశావ్, నీ ఆశీర్వచనం వుంటే నీకు గాజులే చేయించి తెస్తానమ్మా' అన్నాడు పెద్దకొడుకు

'నాకు గాజులెందుకులేరా, కోడలి మెడలోకి ఓ రెండుతులాల గొలుసు చేయించు' అంది తను.

ఆ ఉంగరం అమ్మేస్తే మరో పదిహేను రోజులు గడుస్తాయి కాని వాడొచ్చి ఆయన వేలు చూస్తే బాధపడతాడు — అలా జరగకూడదు పేరిందేవి అనునయంగా చెప్పింది "చూడండి, వాడు ఎంతో ఆప్యాయతతో చేయించింది. అది అమ్మేస్తానంటే ఏం బావుంటుంది వాడు బాధపడడూ ? చూడండి చిన్నాడూ ఉన్నాడు మేడదిగి అమ్మ ఎలా ఉందన్నమాటన్నా అడిగాడా? పైగా రాజాలా అన్నీ చేయించుకుంటున్నాడు మొక్కయి వంగనిది మానయి వంగుతుందా, నేను ముద్దుచేశాను నేనేమైనా అనుకుంటానని మీరూ ముద్దుచేశారు చివరకి వాడలా తయారయ్యాడు "

'చిన్నవాళ్ళు, మనం సర్దుకుపోతుండాలి '

మూడు వారాలయ్యాక మరి ఉండబట్టలేదు పేరిందేవమ్మకి మెల్లగా మేడమీదకెళ్లింది ఓ రాత్రి తన ముద్దులకొడుకు మంచంమీద పడుకొని ఓ చేత్తో పుస్తకం పట్టుకుని చదువుతున్నాడు రెండో చేతిలో రెండున్నాయి ఓ గ్లాసూ, ఓ సిగరెట్టూ పక్క బల్లమీద ఓ బుడ్డీ, మరచెంబుతో నీళ్ళూ కోడలు కుర్చీలో కూచుని చదువుకుంటోంది

'ఏమ్మా, ఇంకా పడుకోలేదూ ?' తలెత్తి చూసి పుస్తకంలో ముఖం దాచుకుంది

'ఏరా, నిన్నే ?'

'నిద్దర రావడంలేకపోతే...'

'బావుంది, ఇదా నువ్వేసే విర్యాకం — ఇల్లెలా గడుస్తుందని అడగవ్ — చచ్చావా, బ్రతికావా అని అడగవ్ — ఒకటే ఒకటే కరిగించి పెట్టుకొస్తున్నాం — నీ సరదాలేకాని కొడుకుగా నీ బాధ్యత నువ్ బోధపర్చుకోకపోతే ఎలా ? పైగా ఈ పాడు అలవాట్లు, ఇంట్లో, ఎంత బరితెగించేశావ్, ఛీ, నీకు సిగ్గులేదూ ?' — ఆవేశం వచ్చింది పేరిందేవమ్మకి ఉండబట్టలేక నాలుగూ అనేసింది

'ఎందుకత్తయ్యగారూ, అలా ఆడిపోసుకుంటారు — మేం ఉండడం ఇష్టంలేకపోతే రేపే వెళ్లిపోతాం. తిండికోసం రాలేదిక్కడికి. తిండిలేకా రాలేదు టెలిగ్రాంగా భావించి రమ్మని రాస్తే ఎక్కడివక్కడ ఒదిలేసివచ్చాం. మేం తిన్నదే మీకు ఎక్కువగా కనపడుతోంది' — కోడలు కసిరేసింది

విలవిల్లాడిపోయింది పేరిందేవమ్మ కొడుకు ప్రేమించి, ఇంట్లో చెప్పకుండా చేసుకుని తీసుకొచ్చినపిల్ల — అత్తయ్యా అని పిలవడానికి నోరురాని పిల్ల — ఉద్యోగం చేసి నెలకు ఆరొందలు సంపాయిస్తున్న పిల్ల —

'హు ! ఎవరి ఖర్మ వాళ్లది.'

కిందకొచ్చేసిన పేరిందేవమ్మ మరి మేడెక్కలేదు

తెల్లవారగానే భర్తకు చెప్పింది— 'అబ్బాయికీ వాళ్ళకీ టికెట్లు రిజర్వు చేయించేయండి — వాళ్లు వెళితేనే నాకు కొంచెం మనశ్శాంతి వుంటుంది '

వెంకట్రామయ్యగారికి ఇంటి సంగతి తెలియక కాదు భార్య ఏం బాధపడుతుందోనని తెలిసినా కిమ్మనకుండా వూరుకున్నారు

మళ్లీ వస్తామని ఉత్తరం, చిన్నాడు

చిన్నాడికి ఉత్తరం పోస్టుచేసి రాగానే 'పెద్దాడ్ని రమ్మని టెలిగ్రాం ఇవ్వండీ!' అంది కళ్ళు తుడుచుకుంటూ

రెండోరోజు సాయంకాలానికి పెద్దాడూ, కోడలూ, పిల్లలూ వచ్చేశారు పేరిందేవమ్మని చూసి అన్నాడు అబ్బాయి : 'దేవుడి దయవల్ల నువ్ కులాసాగా వున్నావమ్మా — టెలిగ్రాం చూసి హడిలిపోయాం '

'ఏం కులాసా నాయనా. ' అన్నా, పేరిందేవమ్మ చుట్టూ కొడుకూ, కోడలూ, పిల్లలూ, భర్తా వుండడం చూసి 'మహారాజుని, నాకేం' అని తృప్తిగా వూపిరి పీల్చుకుంది

ఆ మరునటిరోజు చిన్నవాడూ పిల్లలూ వచ్చారు. వెంకట్రామయ్యగారూ, పేరిందేవమ్మా మొహమొహాలు చూసుకున్నారు. అప్పుడు పెద్దాడు చెప్పాడు 'నేను బయలుదేరుతూ ఎందుకయినా మంచిదని తమ్ముడికో టెలిగ్రాం ఇచ్చాను వాడూ వచ్చాడు '

పేరిందేవమ్మ ఏం మాటాడలేదు.

రాత్రి భోజనాలవుతుండగా పేరిందేవమ్మకి ఆయాసం వచ్చింది

'డాక్టరునుపిలుస్తా' అంటూ వెంకట్రామయ్యగారు బయలుదేరారు అంతా చుట్టూ వచ్చి నుంచున్నారు. 'అమ్మా, మీ చెల్లెల్ని పిలువ్ !' అంది పేరిందేవమ్మ. వెళ్లి పిలిస్తే చిన్నకోడలు వచ్చింది

'నేను మీకు ఇవ్వగలిగిందేం లేదమ్మా, ఈ గొలుసు పెద్దాడు చేయించాడు. ఆరోజుల్లో ఐదు తులాలు అమ్మాయ్ నీకు ఎలాగూ ఆడపిల్లల్లేరు, ఇది చిన్నదాని కిచ్చేయ్ — గాజులు నువ్ తీసుకో ... వాడిది మిగిలిస్తే కూతురు పెళ్లికి బాలతొడుగ్గా ఇవ్వచ్చు...' పెద్దకోడలితోన మాటాడుతోంది పేరిందేవమ్మ

'అదేమిటత్తయ్యగారూ, అలా మాటాడుతున్నారు ... మీకేం ఆరోగ్యంగా వున్నారు మీ ఆరోగ్యం ఇంకా బాగవుతుంది, నాది పూచీ ..'

'ఆ బావుంటుంది. వచ్చినప్పుడల్లా వెయ్యి రూపాయలు పోసుకుని వస్తున్నాం మరి మావల్ల కాదు ' చిన్నకోడలు మూతిముడిచింది

'పోన్లెండమ్మా, మరిరాకండి .. ఒరేయ్ నాయనా, నీకు అన్నీ తెలును — అయినా నేను చెబుతున్నాను మీ అమ్మ పోలిక నీకు — జాలి గుండె — నాదో కోరిక — నేను నిన్ను కనకపోయినా, నీకు నామీద ఎంత అభిమానమో నాకు తెలుసు నే నిన్ను అడిగేది ఒక్కటే, నా తలకి కొరివి '

'ఏమిటమ్మా, నిండు ఇంట్లో వాగాయిత్యం మాటలు . నువ్ పదికాలాలపాటు మాకు పెద్దదిక్కుగా వుండాలి '

'వాగాయిత్యం కాదు. నిజం నీలాంటి కొడుకుంటే ఎన్నాళ్ళు బ్రతికినా ఆనందమే — కాని చావుబతుకులు మన చేతుల్లో లేవు నాన్నగారిని జాగ్రత్తగా చూసుకో — నేనేమైనా అనుకుంటానని మనసులోమాట బయటికి చెప్పరు ఆయన మనసు మరీ సున్నితం '

ఆవిడ గొంతు పూడుకుపోయింది

'పెద్దకొడుకును నువ్ నాకు చెప్పాలా ! నువ్వూ నేనూ వుండగా నాన్నగారికేవమ్మా, రాజాలా వుంటారు తమ్ముడు మాత్రం ఏం చదువులేనివాడా, తెలియనివాడా, ఏదో చిన్నతనం . ' కళ్ళు తుడుచుకున్నాడు పెద్దబ్బాయి

'తమ్ముడు, తమ్ముడు ... హాఁ ! — అబ్బ !' గుండె చేత్తో పట్టుకుని వెనక్కి వాలిపోయింది పేరిందేవమ్మ

'తమ్ముడేడి ?' మరదల్ని అడిగాడు

'సినిమా కెళ్లారు మరో కొడుకున్నాడన్న తలపైనా వుందీ ఈవిడకి మనసులేని మనుషులు ' చిన్నకోడలు వ్యాఖ్యానించింది కసిగా

"ఓయ్, అయిపోయింది అలా పట్టుకో తొందరగా, మంచంమీద ప్రాణం పోకూడదు. "

పెద్దకొడుకూ, కోడలూ దింపుతుంటే తనకు తెలియకుండానే ఘొల్లుమంది చిన్నకోడలు కూడా ●








# ఎల్లప్పుడు చైతన్యంగా
# ఎల్లప్పుడు చురుకుగా

మీ బాబు పెరుగుతున్నప్పుడు, అతను నిరంతరం అదనంగా శక్తి వినియోగిస్తూ ఉంటాడు

మీ బాబుకు శక్తినిచ్చే రుచికరమైన, పాలతో తయారైన మాల్ట్ చాకొలెట్ పానీయం బూస్ట్ ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్ మరియు కోకోతో తయారైనది.

మీ బిడ్డకు శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి అది అతను రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్య వంతంగా ఉండేటట్టు చేస్తుంది






B 5621 T 4

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్
మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

సీరియల్:

# సుదూర తీరాలు

పాటిబండ్ల విజయలక్ష్మి

౨

( గత సంచిక తరువాయి )

ఆరోజు కృష్ణాతీరానికి చేరుకోగానే మామూలు ప్రకారం మాధవ్‌చేత బ్రతిమాలించుకొని అతను వ్రాసిచ్చిన భావగీతాన్ని పాడుతున్న మల్లి చెక్కిళ్ళు ఎరుపెక్కాయి అస్తాద్రికి చేరిన భాస్కరుని రంగుతో పోటీపడుతున్న మల్లి ముఖాన్ని చేతుల్లోకి తీసుకొని, సిగ్గుతో అరమూసుకుపోయిన ఆ కనురెప్పల మీద సున్నితంగా ఓ ముద్ర వేశాడు మాధవ్

బంగారుగా చుట్టూ చూస్తున్న మల్లిని చూసి నవ్వుతూ — "ఈ చుట్టుప్రక్కల ఎవరూ లేరులే భయపడకు అన్నట్లు ఈ పాట ఎలా వుంది మల్లీ! నీకు నచ్చిందా?" అన్నాడు మాధవ్

"ఫో! బావా! ఈమధ్య అన్నీ యిలాంటి పాటలే వ్రాస్తున్నావు. పాడలేక నేను ఛస్తున్నాను' అంది ముద్దుగా మూతి ముడిచి.

నవ్వుతూ మళ్ళీ ముందుకు వంగిన మాధవ్‌ను వెనక్కు నెట్టుతూ బ్రిడ్జివైపు చూపించింది

అక్కడ, నిన్న తను చూసినతనూ, పరమేశం నుంచొని వున్నారు అతను నిన్నటిలాగే 'ట్రిమ్'గా తయారయివున్నాడు

"బావా! పరమేశం ప్రక్కన వున్నతన్ని చూశావా? అతను చూడు ఎంత చక్కగా డ్రెస్ చేసుకున్నాడో! నువ్వలా వుంటే యెంత బావుంటుంది? ఎంత తీవిగా దర్జాగావున్నాడో చూడు"

మౌనంగా గంభీరంగా మారిపోయిన మాధవ్ ముఖం చూసి ఒక్క క్షణం ఆగిపోయింది మల్లి అయినా ఈసారి తప్పకుండా అతన్ని తన మాట వినేలా చేయాలని, తనలో ఎన్నాళ్ళగానో పేరుకుపోయిన కోరిక తీర్చుకోవాలనే గట్టి పట్టుదలగా వుంది ఏది ఏమైనా మాధవ్‌ను ఒప్పించితీరాలి దొరబాబులా మార్చేయాలి

"నాకు సమాధానం కావాలి బావా? నువ్వెప్పుడూ అలా డ్రెస్ చేసుకోవెందుకని? కనీసం నా కోరిక తీర్చడంకోసమైనా అలా వుండాలని ఎందుకనుకోవు?"

చిరుకోపంగా అమాయకంగా అడుగుతున్న మల్లిని చూస్తే పంతంపట్టిన పసిపిల్లలా అనిపించింది తనను మరొకరితో పోల్చుతున్న మల్లి మనస్తత్వానికి బాధపడ్డ మనసే, ఆ అమాయకత్వాన్ని అర్థంచేసుకొని ఆప్యాయంగా ఆమె ముంగురులు సవరిస్తూ చిన్నగా నవ్వుతూ వుండిపోయాడు

బుంగమూతిపెట్టి మాధవ్ చేయి నెట్టేసి దూరంగా జరిగింది మల్లి

"మల్లీ! యిటు చూడు కోపమొచ్చిందా? నీ కెందుకింత పట్టుదల? అలా డ్రెస్ చేసుకోనంత మాత్రాన నీకు నామీద వున్న ప్రేమ తరిగిపోతుందంటే నేనన్నమ్మను అంతమాత్రానికే తరిగిపోయే ప్రేమను అసలు ప్రేమని యెలా అంటాం? నాకెందుకో ఆ పాంటూ, షర్టులకంటే ఈ పంచె లాల్చీయే అందంగా హుందాగ వుంటాయనిపిస్తుంది పైగా వీటిలో ఏదో తెలీని సంప్రదాయసిద్ధమైన ఓ అపురూపమైన ఔన్నత్యం కనిపిస్తుంది నాకు అందుకే కాలేజ్ డేస్‌లో కూడా నేనీ డ్రెస్‌ను తప్ప వేసేవాడినికాదు మొదట మొదట నన్ను ఎగతాళిచేసిన కొందరు, అతికొద్దికాలంలో నన్ను అనుసరించడమేకాకుండా నాకు మిత్రులుగా చాలా చేరువయ్యారు కానీ ఆ కారణంగానే నువ్వు నాకు శత్రువులా ప్రవర్తిస్తున్నావు?" కొంచెం బాధగా అంటున్న మాధవ్‌ను చూసి జాలేసినా పట్టు సడలకూడదని విసురుగా లేచి "నే వెళుతున్నా!" అంటూ మరో మాట కవకాశమివ్వకుండా వెళ్ళిపోయింది మల్లి

డ్రెస్సుకూ ప్రేమకూ ముడిపెడతాడెందుకు బావ? తనమీద నిజంగా ప్రేమవున్న వాడైతే తనకోసం తన యిష్టప్రకారం వుండొచ్చుగా పైగా తన ప్రేమ మీద ఎంత నమ్మకమో! పరిపరివిధాల ఆలోచిస్తూ యిల్లు చేరుకున్న మల్లికి మనసులో ఏదో వెలితిగా బాధగా అనిపించసాగింది ఎప్పటిలా నవ్వుతూ కబుర్లు చెప్పకోకుండా అనవసర ప్రసంగాలతో మాధవ్ మనసు నొప్పించి తనూ బాధపడి వచ్చేసింది

పాపం! బావ ఎంత బాధపడుతున్నాడో!

అంతలోనే మల్లి సమాధానం చెప్పకొంది మనసుకు. ఈ దెబ్బతో అయ్యగారి పట్టుదల ఎంతటిదో తెలిసిపోతుంది మల్లి వారానికి దొరబాబులా దిగకాపోదు, తను కన్నులపండువగా చూడకాపోదు ఈ ఒక్కసారీ కాస్త గట్టిపట్టు పడితే బావ దారికి రాకేం చేస్తాడు? వాకిట్లో మంచంమీద పడుకొని మల్లె పందిరివైపు చూస్తూ మాధవ్‌ను గురించిన మధురోహల్లో తేలిపోతున్న మల్లి, చకచకా తన ముందు నుంచే వాళ్ళింట్లోకి వెళ్ళిపోతున్న మాధవ్‌ను చూసి చిన్నగా నవ్వుకుంది

"అబ్బాయిగారికికూడా కోపం చూపించడం బాగానే తెలుసే!" అనుకుంటూ.

ఆ మర్నాడే మల్లితో చెప్పకుండానే మాధవ్ పట్నం వెళ్ళిపోయాడు మొట్టమొదటిసారిగా మాధవ్ అలా వెళ్ళిపోవడం మల్లికి చాలా బాధ కలిగించింది ఆ వెంటనే స్వాభిమానంతో ఏమైనాసరే ఈసారి మాధవ్ వచ్చి తనంతట తను ఓ రెండుగంటలైనా బ్రతిమాలందే మాట్లాడకూడదని గట్టి నిర్ణయం తీసుకుంది

ఆ సాయంత్రం మామూలుగా కృష్ణ కెళ్ళి నీళ్ళు తీసుకొస్తున్న మల్లికి ఎదురుగా పరమేశం, అతనితోవున్న మిత్రుడూ వచ్చి నుంచున్నారు పళ్ళికిలిస్తూ చెప్పాడు పరమేశం—

"మల్లీ! ఈయన మద్రాసు నుంచి వచ్చారు గొప్ప మ్యూజిక్ డైరెక్టర్ వీళ్ళ బావగారు ఓ పిక్చర్ తీస్తున్నారట. అందులో నేనూ వేషం వేయబోతున్నాను" అంటూ కాలర్ సవరించుకుంటున్న పరమేశాన్ని చూసి ఫక్కున నవ్వు వచ్చినా కనుకొనల్లో నవ్వుని దాచుకొని ఆ క్రొత్త వ్యక్తివైపు చూసింది

అదే క్షణంలో అతనూ పరమేశం మాటలకు నవ్వుతూ మల్లి వైపు చూశాడు. ఆ చూపుల్లో ఏదో అయస్కాంతశక్తి వున్నట్లనిపించి వెంటనే కళ్ళు వాల్చేసింది మల్లి

అతను ఆమె ప్రక్కకు వచ్చి అతిమృదువుగా— "క్షమించండి మీ కభ్యంతరం లేకపోతే ఒక్క అయిదు నిముషాలు మీతో మాట్లాడాలని వచ్చాను" అన్నాడు

ఇబ్బందిగా కదిలింది మల్లి పరమేశం ఒక్కడే అయితే అసలు నిలబడేదేకాదు. అతని హీరో వేషాన్ని ఎగతాళి పట్టిస్తూ అసలు అతన్ని లెక్కచేసేది కాదు కానీ అతనెవరో మర్యాదగా అయిదు నిముషాలు మాట్లాడాలనేసరికి, తప్పనిసరిగా బిందె దించి యిసుకలో పెట్టింది

అతను అమితానందంగా థాంక్స్ చెబుతూ - 'కూర్చోండి" అంటూ తనూ యిసకలో కూర్చున్నాడు.

బిందె ప్రక్కనే బెరుగ్గా కూర్చుంది మల్లి. ఎంత వద్దనుకున్నా పదే పదే ఆమె కళ్ళు అతను వేసుకున్న డ్రెస్‌మీదకే పోతున్నాయి వెలుగూ చీకటీ కాని ఆ సంధ్యవేళ అందంగా మెరుస్తున్న అతనికి తెల్లటి డ్రెస్ ఎంతో బాగా అమరింది

చూడండి మిస్ "

"మల్లిక" పూర్తిచేశాడు పరమేశం.

"ఆ! మల్లికగారూ' నా పేరు మార్యం

---

**జరిగిన కథ-1 :** స్కూలు మాస్టరు దశరథరామయ్యగారి కుమారుడు మాధవ్ ఓ కంపెనీలో మేనేజర్. వారింట్లో వంట చేస్తున్న అన్నపూర్ణమ్మ కూతురు మల్లిచే మాధవ్ తను వ్రాసిన పాటలు పాడించుకొంటూ పరస్పరానురాగబద్ధులవుతారు కాని అతని పల్లెటూరి వేషధారణ మాత్రం ఆమెకు నచ్చదు మున్సబుగారు మాధవ్‌ను తన అల్లుడిగా చేసుకోవాలని పథకం వేస్తుంటాడు

---

మా బావ తీయబోయే పిక్చర్‌కు లొకేషన్స్ చూడటం కోసమని ఈ వూరు వచ్చాం. ఈ చుట్టుప్రక్కల గ్రామాల్లో చాలా ప్రదేశాలు ఎన్నికచేశాం '

ఈ సోదంతా నాకెందుకు అన్నట్లుగా అతని వైపు చూసింది మల్లి

"అయామ్ సారీ! అసలు విషయాని కొస్తున్నాను నిన్న మీ పాట విన్నాను నిజం చెప్పాలంటే యింత మంచి గాత్రముండి మీరు ఈ మారుమూల పల్లెలో ఏ గుర్తింపూ లేకుండా వున్నారంటే నిజంగా అది కళామతల్లికే అవమానం మీరొప్పుకుంటే మీచేత మా పిక్చర్‌లో పాటలన్నీ పాడించాలనే నిర్ణయానికి వచ్చాను మా బావగారు నా మాట కాదనరు పరమేశంగారు యిక్కడే నాకు పరిచయమయ్యారు ఆయనలోని కళాభిరుచి అర్థం చేసుకొని, అతనికీ ఓ పాత్ర ఇవ్వదలిచాము నాకెందుకో ఈ బ్రిడ్జీ, ఈ పరిసరాలూ బాగా నచ్చాయి అందుకే యిక్కడ వున్న వారం రోజులూ యిట్టే గడిచిపోయాయి అదృష్టవశాత్తూ మీ పాట వినగలిగాను మరో వారం రోజులు ఈ చుట్టుప్రక్కల గ్రామాలకు వెళ్ళి చూడాలను కుంటున్నాము కనుక ఈలోపు మీరు ఆలోచించు కొని మీ నిర్ణయం తెలియజేయండి క్షమించండి మీతో మాట్లాడాలనే కోరికను, ఈ విషయాన్ని వెంటనే మీకు చెప్పాలనే ఆత్రుతను, చంపుకోలేక యిమ్మన్న ఆపాల్సివచ్చింది మీరు బాగా ఆలోచించు కునే మీ నిర్ణయం తెలుపండి" అంటూ లేచి నూచుని వంగుని బిందె అందుకొని మల్లికకు అందించాడు అతిదగ్గరగా వచ్చి బిందె అందిస్తున్న అతనినుంచి వచ్చిన ఏదో సుగంధానికి ఓ క్షణం మల్లికి వూపిరాడనట్లైంది మౌనంగా నమస్క రిస్తూ నవ్వుతూ నిలబడ్డ అతనివైపు ఓ క్షణం రెప్పవాల్చకుండా చూసి మెల్లగా కదిలి వెళ్ళిపోయింది.

ఆ రాత్రంతా విచిత్రంగా సూర్యం కళ్ళ ముందు కదిలాడాడు. అందంగా దువ్విన క్రాపింగ్ మాటిమాటికీ చేత్తో సవరించుకుంటూ, ఆరాధనగా చూసే అతని చూపులు కొంచెం యిబ్బంది కలిగించినా, అది అతని కళాభిమానమని సరిపుచ్చుకుంది. అమ్మతో మాష్టారితో ఆ విషయం చెబుదామనుకుని, అంతలోనే ఏదో అనుమానమొచ్చి మానేసింది

ఊహూ! వాళ్ళు ప్రాణంపోయినా తనను మద్రాసు పంపరు ఇంతక్రితం అలాగే ఎవరో సలహా యిస్తే మాష్టారు చివాట్లేశారు సంసార పక్షంగా వుండే పిల్లకు సినిమాపిచ్చి ఎందుకు కల్గిస్తారని ఘాటుగానే మందలించారు

మాధవ్‌తో చెబితే అమ్మో! అతనసలే ఒప్పుకోడు ఎంతసేపటికీ తన పాటలు అతనొక్కడే వినాలి అది స్వార్థం కాదూ! కాని. ఆ స్వార్థంలో వున్న ఆత్మీయతా భావం ఆమె తనకు మాత్రమే సొంతం, తను ఆమెకు మాత్రమే సొంతమన్న ఆ భావన చాలదూ! బ్రతుకంతా సుఖంగా సాగిపోవడానికి

సూర్యం ఏమన్నాడు? తను ఆ మారుమూల పల్లెలో వుండటం కళామతల్లికే అవమానం అని కదూ! అతను తన పాటకు ఎంతగా పరవశించక పోతే అంత బాగా మాట్లాడతాడు? అతని మాటల్లో ఎంత మర్యాద! నిజానికి అతను మాట్లాడుతున్నంతసేపూ ఆ రెప్పవాల్చడం కూడా మరచి చూస్తూండిపోయింది

తన గొంతు అంత బావుంటుందా? సినిమాలో పాటలన్నీ తనచేతే పాడిస్తానంటున్నాడే ఆ సూర్యం ఆలోచనలతో కలతనిద్దరలోనే తెల్లవారింది మల్లికి.

ఆరోజంతా ఆలోచిస్తూనే గడిపింది తల్లి చెప్పిన ఒకటి రెండు చిన్నపనులు కూడా అవకతవకగా చేసి తల్లిచేత చివాట్లు తింది

సాయంత్రం మామూలుగా నీళ్ళకెళ్ళిన మల్లికి ముందే ఎదురయ్యాడు సూర్యం ఒంటరిగా రేవులో మరో మనిషి వున్న జాడలేదు నవ్వుతూ నమస్కరించిన సూర్యాన్ని చూసి తనూ నవ్వకుండా వుండలేకపోయింది

చనువుగా మల్లి చేతిలో బిందె తీసుకొని యిందుకు నడుస్తున్న అతన్ని మౌనంగా అనుసరించడంకంటే మరేం చేయలేకపోయింది.

దూరంగా యిసుకలో కూర్చుంటూ బిందె ప్రక్కనపెట్టి,

"మల్లికగారూ! యివాళ ఏమైనాసరే, మీ పాటలు మళ్ళీ వినాలని వచ్చాను నిన్న దూరం నుంచి విన్నాను గాలికి అలలుగా తేలివచ్చిన



# సుదూర తీరాలు

ఆ భావ గీతం మనసులో అలాగే నిలిచిపోయింది ఒక్కసారి ఆ పాట పాడరూ!'' అర్థింపుగా అడుగుతున్న సూర్యం వైపు సిగ్గుగా చూస్తూ-

''అది నా గొంతులో గొప్పదనం కాదు మా బావ వ్రాసిన పాటలో గొప్పదనం'' అంటున్న మల్లి కళ్ళు గర్వంగా మెరిశాయి

''ఏవిటీ! ఆ పాట మీ బావ వ్రాశారా? అయితే యింకే మా పిక్చర్‌కు పాటలు ఆయన్నే రాయమనవచ్చు'' అంటున్న సూర్యం మాటలకు ఎగిరిగంతేసినంతపని జేసింది మల్లి

''నిజంగానా! మా బావ వ్రాస్తే, ఆ పాట నేనే పాడాలనే కండిషన్ కూడా పెడతాడండోయ్ జాగ్రత్త!'' అంటూ అల్లరిగా అమాయకంగా నవ్వుతున్న మల్లిని చూసి తనూ నవ్వేస్తూ,

''మరేం ఫర్వాలేదు. మీరు పాడే పాటలు మట్టుకే ఆయన్ని రాయమంటే అప్పుడు సమస్య లేదుగా?'' అన్నాడు నవ్వుతూ

అతని నవ్వుతో శ్రుతికలుపుతూ గలగలా నవ్వింది మల్లి

''పోన్లెండి అలా అయితే ఫరవాలేదుగానీ, పాటలన్నీ మా బావనే వ్రాయమంటే, ఆడపాటలూ, మగపాటలూ అన్నీ నేనే పాడాల్సవచ్చేది'' అంటూ పకపకా నవ్వుతున్న మల్లి నవ్వులో కనిపించే అందాలను చూస్తూ,

''ఒకవేళ అలా చేయాల్సివస్తే అదీ వో న్యూవేవ్ చిత్రమంటే ప్రజలు నమ్మేస్తారు మాకేం బాధలేదు మా డబ్బులు మాకొస్తాయి ఊ! యింక మాటలు ఆపి ఒక్క పాట పాడండి విని తరిస్తాను'' అంటున్న సూర్యం ఎంతో సన్నిహితుడిలా, హితుడిలా అనిపించడంతో మరోసారి అడిగించుకోకుండానే పాట మొదలెట్టింది

ఆ గొంతు వింటుంటే అలా సమస్త ప్రపంచాన్నీ మరచి అక్కడే వుండిపోవాలనిపిస్తుంది అలలపై తేలివచ్చే చిరుగాలితో కలిసి, సప్త స్వరాలూ ఆ గొంతునుంచే పుట్టినట్టు తీగలా సాగుతున్న ఆ గానవాహినికి సమస్త ప్రకృతీ పులకిస్తున్నట్టు తలలూపుతుంటే, ఆ గానంకంటే అధికంగా తన్నాకర్షిస్తున్న ఆ అందాలరాశి అందాన్ని తనివితీరా చూస్తూ, ఏవో లోకాల్లో తేలిపోతున్నాడు సూర్యం పాట ముగిసేసరికి చిరుచీకట్లు ముసురు కుంటున్నాయి

పాట అయ్యా కాకముందే మల్లి చేయి తన చేతుల్లోకి తీసుకొని గట్టిగా నొక్కుతూ,

''మార్వెలెస్ మల్లికా! నీకు సాటిరాగల గాయని యింతవరకూ లేదు యిక రాబోదు నీకు నువ్వే సాటి'' అంటూ తన్మయంగా చెబుతూ, యిబ్బందిగా చెయ్యి విడిపించుకుంటున్న మల్లివైపు చూసి —

''అయామ్ సారీ! ఆ వుద్వేగంలో అభినందించాలనే ఆతృతలో మీ చెయ్యి నలిపేసినట్లున్నాను అయామ్ సారీ క్షమించండి. మరో మాట మల్లికా, మీరే మా పిక్చర్‌లో హీరోయిన్‌గా ఎందుకు యాక్ట్ చేయకూడదు? యు గాట్ ఆల్ ద క్వాలిటీస్ ఆఫ్ ఎ హీరోయిన్! మిమ్మల్ని తారాపథాన చూసేంతవరకూ నేను నిద్రపోను మీరు గొప్ప గాయని కావాలి గొప్ప నటి కావాలి అప్పుడే నా మనసుకు శాంతి!'' అంటూ ఉద్రేకంగా చెబుతున్న సూర్యం వైపు విచిత్రంగా చూసింది మల్లి.

తను హీరోయిన్ అవడమేవిటి? యిది జరిగే పనేనా? ఇందుకు తన మనస్సూ అంగీకరించదు బావ అంతకంటే ఒప్పుకోడు పాటలంటె ఎలాగో సర్దిచెప్పవచ్చు పైగా బావను కూడా పాటలు వ్రాయమంటున్నారు కనుక, అతనికి అభ్యంతరం వుండకపోవచ్చు ఈ సూర్యమేమిటి? గాయనిని చేస్తానంటున్నాడు, తారను చేస్తానంటున్నాడు! ఆలోచనలో పడిపోయిన మల్లి వైపు ఓ క్షణం చూసి, ఆమె ఆలోచనలు గ్రహించినట్లే,

''మీరేం కంగారుపడకండి ప్రస్తుతానికి మా పిక్చర్‌లో పాటలు పాడండి చాలు ఆ తర్వాత మీ కిష్టమైతే యాక్ట్ చేయవచ్చు లేదంటే గాయనిగానే వుండిపోవచ్చు మా పిక్చర్‌లో మీ పాట మట్టుకు వుండితీరాలి, పదండి మిమ్మల్ని అంతవరకూ పంపిస్తాను'' అంటూ తనే బిందె తీసుకొని నీళ్ళు ముంచి మల్లి కందించాడు నవ్వుతూ అందుకుంది మల్లి అతని అతిమర్యాదలు చూస్తుంటే, అతను చాలా అమాయకుడిలా కనిపించాడు బావ రాగానే అతన్ని బ్రతిమాలి ఎలాగైనా సినిమా పాటలు వ్రాసేలా వప్పించాలి అప్పుడు తను పాడటానికి కూడా అభ్యంతరం వుండదు గాయనిగా గొప్ప పేరు సంపాదించవచ్చు

మౌనంగా ఆలోచిస్తూ నడుస్తున్న మల్లి సూర్యం పిలుపుతో ఆగిపోయింది.

'మల్లికా! యిక నేను వుంటాను బ్రిడ్జి అవతల కారుంది ప్రక్క వూరెళ్ళాలి మళ్ళీ రేపు సాయంత్రం యిదే వేళకు వస్తాను తమ దర్శనం చేసుకుంటాను నేనీ వూట వచ్చినట్లు పరమేశానికి తెలియదు మీరూ చెప్పకండి మిమ్మల్ని వొంటరిగా కలిసి మీ పాట వినాలనే కాంక్షను చంపుకోలేక, అతనికి నే నొస్తున్నట్లు తెలియజేయలేదు మంచి ఉత్సాహంగా వున్నాడు యాక్ట్‌చేయాలని వాళ్ళ నాన్నగారికి కూడా నన్ను పరిచయం చేశాడు మాతోపాటే మద్రాసు రావాలని అతని ప్రయత్నం కానీ అది జరిగే పని కాదులెండి ఏదో అతమూలంగా మీ పరిచయ భాగ్యం కలిగింది అతనికి నేనెంతో ఋణపడి వున్నాను ఇక వస్తానండీ! మళ్ళీ రేపు యిదే వేళకు యిక్కడే కలుసుకుంటాను'' అంటూ నమస్కరించి ఠీవిగా నడిచి బ్రిడ్జి వైపు అడుగులు వేస్తున్న సూర్యం వైపు కొంతసేపలాగే చూస్తుండిపోయింది ఎర్రటి గీతలున్న తెల్లటి షర్ట్ మాచింగ్ కలర్ బెల్‌బాటమ్ పాంటు అచ్చంగా హీరోలా కనిపిస్తుంటే రెప్పవాల్చకుండా చూస్తూ నుంచున్నదల్లా, అంతలోనే అతను వెనుదిరిగి చూసి నవ్వుతూ చెయ్యి వూపగానే,

చటుక్కున తల తిప్పేసుకుని కుడివైపు నడక సాగించింది సిగ్గుగా తను పరీక్షగా అతన్ని చూస్తూ నుంచోడం అతని కంట్లో పడటం మల్లికి యిష్టంలేదు తను ఆ బట్టల్లో మాధవ్‌ను ఊహించుకుంటూ ముసిముసినవ్వులు నవ్వుకుంటుంటే చూసి అతనేమనుకున్నాడో ఛీ! పాడుమనసు, వూరికే బావను గురించి తప్ప ఆలోచించదు ఆ దొరగారు వారంలో ఒక్కసారైనా తనని తలుచుకుంటారో లేదోగానీ, తనుమట్టుకు ఒక్కక్షణమైనా అతని తలపుల్లేకుండా వుండలేదు

గిర్రున వారంరోజులు తిరిగిపోయాయి ఈ వారంరోజుల్లో సూర్యం ఒక్కరోజు కూడా మిస్‌కాకుండా కృష్ణాతీరాన మల్లిని కలసి ఆమెకు మద్రాసును గురించి పంచరంగుల స్వప్నాలు చూపించాడు అతను పరిశ్రమ గురించి విశేషాలు, సినీ పరిశ్రమలో తనకు ఎంత యిన్‌ఫ్లుయన్స్ వుందీ వర్ణించి చెబుతుంటే అమాయకంగా మంత్రముగ్ధలా వినేది సామాన్యంగా సూర్యం సమక్షంలో మల్లికి మాట్లాడే అవకాశ మిచ్చేవాడు కాదు ఊపిరాడకుండా ఏవేవో కబుర్లు చెబుతూ



# జయప్రద సిగ్గుతో
# ఎరుపెక్కేందుకు కారణాలు

తెరపై ఓ గంభీరమైన సన్నివేశంలో తనను
తానే చూసుకోవడం
గుప్త అభిమానుల వద్ద నుండి పుష్పగుచ్ఛాలు
తన రెండేళ్ళ వయసులో ఉన్నప్పటి
ఫోటో చూసుకోవడం
ఆమె చర్మ సౌందర్యాన్ని గురించిన ప్రశంసలు
....అదే లక్స్ రహస్యం

**"లక్స్‌తో నా చర్మ సౌందర్యం మృదువుగానూ, మనోహరంగానూ వుంటుంది" అంటుంది జయప్రద.**

R. Jaya Prada




**శుద్ధమైన, సౌమ్యమైన లక్స్–
సినిమాతారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు.**

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

HLL-3811

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## 'కల్యాణ చక్రవర్తి'లో కల్యాణ్, చక్రవర్తి

కల్యాణ్ (కృష్ణంరాజు) బంగళా. పెళ్ళి చూపులకని వచ్చిన పురుషోత్తం (ప్రభాకరరెడ్డి), హేమను కించపరిచేసరికి ఆమెచేత లెంపకాయ వేయించాడు చక్రవర్తి (కృష్ణంరాజు). పురుషోత్తం రెచ్చిపోయి, "ఆడదానివి — నువ్వు నామీద చెయ్యి చేసుకుంటావా? నీ బతుకు బజారుకీడుస్తాను," అన్నాడు.

"నేను బతికుండగా అది నీవల్ల కాదురా," అన్నాడు చక్రవర్తి.

"చక్రవర్తి! ఈ విషయం నలుగురికీ తెలిసి నవ్వులపాలు కాకముందే వాళ్ళని పంపేయ్, ప్లీజ్!" అన్నాడు కల్యాణ్.

అందుకు చక్రవర్తి "అదిగో — అదే... ఆ భయమే వద్దన్నాను, సార్! నవ్వడానికి ఆ నలుగురూ ఎవరు, సార్? పత్తిత్తులా? ఒక్కొక్కరి వెనుక వంద పేజీల చీకటి బతుకుంటుంది, సార్. ఇలా నలుగురికీ భయపడి బ్రతకడం వల్లే మీ జీవితం ఇలా అయిపోయింది. భయపడే వాళ్ళని సంఘం మరింత భయపెడ్తుంది, సార్! ఒక్కసారి గుడ్లురిమి ఎదురుతిరగండి. తోక ముడుచుకొని పారిపోతుందో — లేదో చూడండి, సార్! పిల్ళంతా పెద్దమనుష్యులు కారు, సార్? పెద్దమనుష్యులనే ముసుగు తొడుక్కున్న పందికొక్కులు. మీరంటే ఎంత చిన్నచూపు లేకపోతే ఈ సౌర్భాగ్యుడు మీ చెల్లిని ఉంచుకుంటావని మిమ్మల్నే అడుగుతాడా, సార్? వాడి కూతుళ్ళు మాత్రం ఓ ఇంటి కోడళ్ళవ్వాలి — మరో తల్లికూతుళ్ళు తనకి ఉంపుడుకత్తెలు కావాలి. నల్లకోటు తొడుక్కొని కోర్టులో న్యాయం గురించి వాదించడం కాదు, సార్! ఇప్పుడు చెప్పండి — న్యాయమా ఇది? రేయ్, పురుషోత్తం! ఇంకోసారి ఆ పిల్ల గురించి ఎక్కడైనా, ఎప్పుడైనా హేళనగా మాట్లాడేవో — నీ ఎముకలు విరిచి, వాటితో చలిమంట కాగుతాను! పో — దొంగవెధవా!" అని గర్జించాడు.

"చక్రవర్తి! నన్నే అవమానిస్తావుగా? చూస్తాను. ఈ పిల్లని ఎవడు పెళ్ళి చేసుకుంటాడో చూస్తాను. ఏదో ఓ రోజున ఈ పిల్లా, నువ్వూ నా కాళ్ళమీద పడవలసిందేరా!" అని రెట్టించాడు పురుషోత్తం.

"చక్కటి వరుడితో ఆ పిల్ల పెళ్ళి జరిగేలా నేను చూస్తాను! నువ్వేం చేస్తావో, చెయ్యగలవో అదీ చూస్తాను!" అన్నాడు చక్రవర్తి.

కొరకొర చూస్తూ పురుషోత్తం వడివడి అడుగులతో నిష్క్రమించాడు.

కృష్ణంరాజు ద్విపాత్రాభినయం నిర్వహించే నవజ్యోతి పిక్చర్స్ "కల్యాణ చక్రవర్తి" వర్ణచిత్రాన్ని ఎం. ఎస్. కోటారెడ్డి దర్శకత్వంలో పి. నాగేశ్వరరావు నిర్మిస్తున్నారు. నిర్వహణ: ఎస్. సాంబశివరావు.

## డైరెక్టర్ పి సి రెడ్డి కొత్త చిత్రాలు

"హీరో కృష్ణతో 'ఏరువాక' వర్ణచిత్రం నూతన వత్సరారంభంలో మొదలెడ్తున్నాం. ఈశ్వరీ చిత్ర పతాకంలో తయారౌతుందిది. కథ నేనే రాశాను. నాతోపాటు మహారథి, భీశెట్టి స్క్రీన్‌ప్లే రాస్తున్నారు. సంభాషణలు మహారథి రాస్తారు. హీరో శోభన్‌బాబుతో ఉషశ్రీ సంస్థ నిర్మించే కలర్ పిక్చర్ వచ్చే ఏప్రిల్ నుండి ప్రారంభమవుతుంది. లోగడ ఈ సంస్థ నిర్మించిన 'మానవుడు—దానవుడు' చిత్రకథను మించిన కథ... తన సోదరుని కోసం ప్రపంచంలో ఏ సోదరుడూ చేయనంత త్యాగం చేసి, తనవాళ్ళకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకున్న ఓ ధీరోదాత్తుని కథ ఈ చిత్రానికి ప్రాణం. శ్రీదేవి ఆర్ట్స్ పతాకంలో జనవరి నుంచి యువతరం కథానాయకులతో ఓ సంచలన చిత్రం ప్రారంభించబోతున్నాం. దీనికి కథ, స్క్రీన్‌ప్లే నేనే రాశాను. భీశెట్టి సంభాషణలు రాస్తున్నారు. మహదేవన్ సంగీత దర్శకుడు. ఎం. సి. శేఖర్ ఛాయాగ్రాహకుడు. ఈ చిత్రం అన్నపూర్ణా ద్వారా విడుదలవుతుంది," అన్నారు డైరెక్టర్ పి. చంద్రశేఖరరెడ్డి. ఈయన దర్శకత్వంలో ఈశ్వరీ చిత్ర హీరో రంగనాథ్, శరత్‌బాబు మున్నగువారితో తెలుగు తమిళ భాషల్లో నిర్మించిన "కాళరాత్రి" విడుదలకు సిద్ధంగా ఉంది. పి. బలరామరెడ్డి, జి. రెడ్డిశేఖర్ నిర్మించిన ఈ చిత్రానికి భీశెట్టి రచయిత.

'నిండు నూరేళ్ళు'లో మోహన్‌బాబు, జయసుధ



# సుదూర తీరాలు

మల్లిని నవ్వించేవాడు. అతనితో కూర్చుంటే కాలగమనమే తెలిసేది కాదు. ఏదో వింత ఆకర్షణ మల్లిని రోజూ కృష్ణాతీరానికి సంకెళ్ళు కట్టి లాక్కుపోయేది.

ఆ రోజు శనివారం. మాధవ్ సాయంత్రం వస్తాడని, అతనికి చెప్పవలసిన కబుర్లన్నీ మననం చేసుకుంటూ కూర్చుంది మల్లి. మధ్యాహ్నం పన్నెండు గంటలకే "పోస్ట్!" అన్న కేక వినబడగానే పరుగున వెళ్ళి కవరందుకుంది.

అది మాధవ్ వ్రాశాడు. రెండే రెండు వాక్యాలున్నాయి.

"మల్లీ! అనుకోకుండా యిన్‌స్పెక్షన్ రావడంవల్ల ఈ వారం నేను రాలేకపోతున్నాను. మళ్ళీ వచ్చే వారం వస్తాను. నాన్నగారికి చెప్పు."

నీ బావ
మాధవ్

ఆ వుత్తరం చదవగానే నీళ్ళుగారిపోయింది మల్లి. మాధవ్ ఎంత అర్జంట్ పనులున్నా ఒక్క పూటన్నా వచ్చి వెళ్ళకుండా ఎప్పుడూ లేదు. పైగా అంత నిర్లక్ష్యంగా ఎప్పుడూ తనకు లెటర్ వ్రాయలేదు. రెండే రెండు వాక్యాలు — అదిమట్టుకు వ్రాయకపోతేనేం. వ్రాయకపోతే ఎవరు కొట్టారు? ఆలోచనలు మనసులో సుళ్ళు తిరుగుతుంటే కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. తను ఈ వారం గురించి ఎన్ని రోజులుగా ఎదురుచూస్తోంది? అతనికేమాత్రం లెక్కలేదు. ఆ రోజు, అలాగే చెప్పకుండానే వెళ్ళిపోయాడు. వెళ్ళగానే లెటర్ వ్రాస్తాడు అనుకుంటే లెటర్ వ్రాయలేదు. యిప్పుడు తను రావడంలేదని, అంత నిర్లక్ష్యంగా వ్రాయడాన్ని చూసి మల్లి మనసు వుడికిపోయింది వుక్రోషంతో

[ఇంకా వుంది]

ఆంధ్రప్రదేశ్‌లో సంచలనాన్ని సృష్టించిన రజతోత్సవ చిత్రం
"పొట్టేలు పున్నమ్మ" నిర్మాత ద్వితీయ కానుక!



దేవర్ ఫిలింస్

# అమ్మ ఎవరికైనా అమ్మ

ఈస్ట్‌మన్ కలర్

కథ-స్క్రీన్‌ప్లే:
శాండో ఎమ్ ఎమ్ ఎ చిన్నప్పదేవర్

దర్శకత్వం
ఆర్ త్యాగరాజన్ B.Sc.,

నిర్మాత
సి దండాయుధపాణి B.Com.,

నిర్వహణ
చిత్తూరు ఆనందనాయుడు



వరల్డ్ నెగిటివ్ రైట్స్ కంట్రోలర్స్:
రావుల అంకయ్యగౌడ్,
రవీంద్ర ఫిలింస్ గూడూరు

లక్ష్మీ ఫిలింస్

ASSOCIATED

# సినిమా



'దశ తిరిగింది'లో మురళీమోహన్

## విజయలక్ష్మి మూవీస్

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో జి. వి. ఎస్. రాజు నిర్మించే వన్నెల చిత్రానికి పాటల రికార్డింగ్ జనవరిలో, షూటింగ్ ఫిబ్రవరిలో ప్రారంభమవుతాయి. కృష్ణంరాజు హీరో. సత్యం సంగీత దర్శకుడు. ఇతర సాంకేతిక నిపుణులు దాసరి యూనిట్‌లోనివారే.

## గొప్పవారి గురించి కొన్ని విషయాలు

ఇటీవలే దివంగతులైన ఎ. వి. మెయ్యప్ప చెట్టియార్ "అవర్గళ్" (ఇది కథ కాదు) కె. బాలచందర్ చిత్రం చూసి, 'క్లాస్' ఆడియన్స్ కన్నా ఎక్కువగా 'మాస్'ను ఆకర్షించేలా రాజీపడాలని మీ డైరెక్టర్‌గారితో కాస్త చెప్పండి, అంటే, 'కళాకేంద్ర' గోవిందరాజన్ "అలా బాలచందర్‌గారితో డైరెక్షన్ గురించి చెప్పేంత ధైర్యం మాకు లేదు. మీరే చెప్తే, బావుంటుంది" అన్నారు. అందుకు చెట్టియార్ ఇచ్చిన జవాబు: "నేను బాలచందర్ అభిమానిని. నేనెలా చెప్పగలను?" అని.

ఆ మధ్య "ఆనంద వికటన్" తమిళ వార పత్రికలో ప్రచురితమైన ఒక చక్కని కథను చదివిన వెంటనే ఒక పాఠకుడు ఆనందోద్రేకంలో తన పేరు తెలియజేయకుండా ఆ కథకునికి వెయ్యి రూపాయలు బహుమానంగా పంపాడు. ఆ పాఠకుడు మరెవరో కాదు; చెట్టియారే!

కీ॥ శే॥ ఎం. ఆర్. రాధా అస్వస్థులవడానికి ముందు జరిగిన ఓ సంఘటన... తన ఔట్‌డోర్ సన్నివేశాలకు డబ్బింగ్ చెప్పడానికి ఆయన ఒక రికార్డింగ్ థియేటర్‌లోకి వెళ్లి, ఆయాసంతో ఒక పేముకుర్చీలో కూర్చున్నారు. మైక్‌ను ఆయన దగ్గరికే తెచ్చి అమర్చేసరికి ఆయనకు కల్గిన కోపం ఇంతా అంతా కాదు. "వృత్తికి గౌరవం ఇవ్వాలయ్యా! నటుడన్నాక నిలుచునే మాట్లాడాలి అదే సరైన పద్ధతి, ఆచారంకూడానూ," అంటూ లేచి నిలుచునే డబ్బింగ్‌లో పాల్గొన్నారు.



అనిల్ ప్రొడక్షన్స్ చిత్రంలో జయప్రద



ఒక కొత్త హీరో నటించే చిత్రంలో "నేను చెప్పినట్లు వినకపోతే, నువ్వు నామరూపాలు లేకుండా నశించిపోతావురా!" అన్న డైలాగ్ దుష్టపాత్ర ధరించే ఎం. ఆర్. రాధా చెప్పాలి. కాని, అందుకు ఆయన మనసొప్పలేదు. "డైరెక్టర్‌గారూ! దయచేసి ఈ ఒక్క డైలాగ్ మార్చండి. ఈ అబ్బాయి ఇప్పుడే కొత్తగా ఈ రంగంలో ప్రవేశించాడు. ఇతన్ని ఉద్దేశించి నేనలా అనడం బాగోలేదు," అని ఆ డైలాగ్‌ను "నేను చెప్పినట్లు వినకపోతే, అన్యాయమైపోతావురా!" అని మార్పించారట.

## వెండిరథం

తోట సుబ్బారావు నేతృత్వంలో కల్యాణి ఫిలింస్ "వెండిరథం" అనే వన్నెల చిత్రం తయారైంది. "ఇది భక్తిరసప్రధాన చిత్రం అక్టోబర్‌లో విడుదల చేయాలనుకుంటున్నాను," అన్నారు నిర్మాత నందిగం రామలింగేశ్వరరావు కె. ఆర్. విజయ, వెన్నిరాడై నిర్మల, జయమాలిని, విజయకుమార్, నాగేష్, ఎం. ఆర్. ఆర్. వాసు పాత్రధారులు. సంగీతం: ఎం. ఎస్. విశ్వనాథన్, జె. వి. రాఘవులు. మాటలు, పాటలు: రాజశ్రీ కూర్పు: సుబ్బారావు. దర్శకత్వం: కృష్ణన్, పంజు



## ఏకకాలంలో దాసరి నారాయణరావు కొత్త చిత్రాలు

ఎ. ఎన్. ఆర్. తో వై. అరుణప్రసన్న మార్చిలో ప్రారంభించే వన్నెల చిత్రానికి చక్రవర్తి సంగీత దర్శకుడు. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు. పవన్ ఇంటర్నేషనల్ వారి నిర్మాణం.

ఎ. ఎన్. ఆర్., శ్రీదేవిలతో మార్చి నెలలో ప్రారంభమయ్యే మరో చిత్రాన్ని లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ పతాకంలో అనూరాధాదేవి నిర్మిస్తారు.

పై రెండు చిత్రాలకూ దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం నిర్వహిస్తారు. "ఏడంతస్తుల మేడ"ను దాసరి దర్శకత్వంలోనే హీరో జితేంద్ర హిందీలో నిర్మిస్తారు. "పుట్టినిల్లు – మెట్టినిల్లు" ఆధారంగా హీరో జితేంద్రతో పల్లవి సంస్థ అధినేత ఎస్. వెంకటరత్నం హిందీలో రూపొందించే చిత్రానికి దాసరి డైరెక్టరు.

కృష్ణంరాజు సమర్పించే జయకృష్ణా మూవీస్ "సీతారాములు" వన్నెల చిత్రానికి దాసరి దర్శకత్వం వహిస్తున్న విషయం గత సంచికలో తెలియజేశాను.

'మూగకు మాటొస్తే'లో రమాప్రభ, జయసుధ, కవిత

...చ్చిన కొడుకులో ...డి స్థితి

...లక మంచంమీద బాధతో కూర్చొనున్నాడు ...(కృష్ణ). అతని గాయాలను తడిగుడ్డతో ...తూ వింపిస్తోంది రాజీ (శ్రీదేవి). గోపి ప్రయత్నంగా తల తిప్పేసరికి గుమ్మం వద్ద నిలుచొనున్నాడు గజపతి (సత్యనారాయణ). "మీరా!" అంటూ గోపి విస్మెరపోయాడు. "ఈవేళప్పుడు మీరెందుకు బయలుదేరి వచ్చారు? అంత అర్జంట్ పనుంటే నాకు కబురుచెయ్యక పోయారా?"

"గోపీ! ఈ పరిస్థితుల్లో నేనే నీ దగ్గరికి బయల్దేరిరావడం మనిషిగా నా మొదటి కర్తవ్యం. నీకు మనస్ఫూర్తిగా క్షమాపణ చెప్పుకుందామని వచ్చాను, గోపీ! శేఖర్ చేసిన ఈ దురాగతం నీ మీదకాదు, గోపీ! నామీద; నా బ్రతుకుమీద. నా తలరాత అంతా నా కొడుకు పాపాలతో, దుర్మార్గాలతోనే నిండిపొట్టింది. ఏ జన్మలో మహాపాపం చేశానో — ఈ జన్మలో అనుభవిస్తున్నాను మన్నింపులు కోరుకుంటూ, క్షమాపణలు చెప్పుకుంటూ — ఎంత గొప్ప బ్రతుకు నది!" అని కన్నీళ్ళు తుడుచుకుంటూ గజపతి "ఆఁ... అసలు సంగతే మరిచిపోయాను, గోపీ! త్వరగా సిద్ధంకా. మనింటికి వెళ్ళిపోదాం," అన్నాడు.

"మనింటికా?" అన్నాడు గోపి విభ్రాంతపోయి.

"అవును, గోపీ. మనింటికే పిల్లలు, లక్ష్మి నీ కోసం ఎంతో ఆదుర్దాతో ఎదురు చూస్తున్నారు నేను డాక్టర్ని తీసుకొస్తాను. రెడీగా వుండు," అంటూ గజపతి హడావిడిగా వెళ్ళిపోయాక రాజీ డగ్గుత్తికతో "పాపం! గజపతిగారు కోటీశ్వరుడైనా బికారి. తల్లి, తండ్రి, తమ్ముడు, చెల్లెలు — అందరికీ ఆ శేఖర్ పంచియిస్తున్నది పుట్టెడు దుఃఖం. భగవంతుడు వాళ్ళకు అన్నీ ఇచ్చాడు — ఒక్క సుఖం తప్ప. ఎంత మంచి కుటుంబం! కాని, ఏం లాభం? ఆ కుటుంబంలో తిరిగి నవ్వులు పంచే పుణ్యాత్ము డుంటే ఎంత బాగుండేది!" అని నిట్టూర్చింది.

శేఖర్‌గా గిరిబాబు, తల్లిగా అంజలీదేవి నటిస్తున్నట్లు తెలియజేశారు డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్. పి. బాబ్జీ, జి. సాంబశివ రావు నిర్మిస్తున్న త్రిమూర్తి ప్రొడక్షన్స్ వన్నెల చిత్రం "దేవుడిచ్చిన కొడుకు" షూటింగ్ దాదాపు పూర్తయినట్లే.

'జాతర'లో

పెద్దమనుషులు వేసే పాతర

పశువుల పాకవద్ద శంకరం (శ్రీధర్), భూషయ్య (నాగభూషణం) ఉన్నారు. శంకరం ముఖంలో ఏదో ఆదుర్దా కనిపిస్తోంది. "అళ్ళు చిన్న మాటాడితే, తమ్ముడికి వుజ్జోగం వచ్చేత్తా దంట," అన్నాడు అమాయకంగా.

"అళ్ళ మాటకంత యిలువ వుండబట్టే అళ్ళు మాట్టాడరు... పెద్దోళ్ళ యవ్వారం యెట్టాగుంటదంటే — యెక్కడైనా బావగాని, వంగతోటలో మాత్రం కానట్టుంటది... ఆఁ..." అన్నాడు భూషయ్య.

"యెంతివ్వాలంటావ్?"

"పనినిబట్టుంటది మరి... తమ్ముడికి జీతమెంతన్నావ్?"

"నెలకి నాలుగొందలు."

"ఓ అయిదువేలైనా లేపోతే ఆనదేమో!"

"ఏదేలే!"

"అయిదేలంటే మనకి అబ్బురంగా వుంటది. కాని, అళ్ళకి అర నిమిషం కరుసు."

"తమ్ముడికి వుజ్జోగం వచ్చేత్తే యే గొడవా లేదు. యిన్నాళ్ళా నీకాడే అప్పట్టుకెళ్ళాను. యిదీ నీమీదే..."

"సరే... సూద్దాం."

"అల్లాతో నువ్వు గట్టిగా సెప్పాలి, మావాఁ!"

"అలాగే. రేపోమాటు కనిపించు. అన్నట్టు పాత బాకీ యేవన్నా జమ కట్టావా? మా కిట్టమూర్తితో తిక్కోడు. ఆడికన్నీ కరకట్టుగా వుండాలి. రోజులు మారిపోయినయ్; నోటుమీద అప్పు యివ్వటం మానేద్దామూ అంటాడు. కాని, ఎలా మానేత్తాం? మనకు అందరూ కావలసినోళ్ళే. అందుకని తనకామీదన్నా అప్పిద్దాం అని కిట్టమూర్తి నొప్పించాము."

"నీ యిట్టం. నేనెల్లొత్తాను, మావయ్యా!"

చెరుకూరి జనార్దనరావు సమర్పించే "జాతర" వన్నెల చిత్రాన్ని ధవళ సత్యం దర్శకత్వంలో ఆర్. ఎస్. రామరాజు నిర్మించారు

'కళ్యాణ చక్రవర్తి'లో కృష్ణంరాజు



'హరేకృష్ణ హలో రాధ'లో శ్రీప్రియ, కృష్ణ

# సినిమా

## "శివమెత్తిన సత్యం"లో శవమైన జగన్

జగన్ హుషారుగా ఈల వేసుకుంటూ, తన పడక గదిలోకి వచ్చాడు. అక్కడ సత్యం కూర్చొనుండడం చూసి ఖంగుతిన్నాడు: "సత్యం... నువ్వు... ఇక్కడ!"

"సత్యం లేని చోటు, రాలేని చోటు లేదు."

"అవునవును. కాని... కాని..." అంటూ జగన్ వెనక్కు నక్కివెళ్లి పారిపోడానికి ప్రయత్నిస్తున్నాడని తెలిసి, సత్యం ధన్‌మని తలుపు తన్నాడు అది మూసుకుంది.

"సత్యాన్ని తప్పించుకు పారిపోలేవు. అయినా— సత్యమంటే ఎందుకు భయం?"

"నువ్వు — నువ్వు... హంతకుడివి... మోహన్‌ని ఖూనీ చేశావు."

"ఆత్మహత్య అంటున్నారు పోలీసులు?"

"నిజం వాళ్ళకేం తెలుసు?"

"నీకు తెలుసా? ఈవాడు ఈ నిజం తెలిసిన వాడికి — ఆవాడు, సత్యం నిర్దోషి అన్న నిజం మాత్రం తెలియకపోయిందా?"

"సత్యం!... సత్యం! నీకు ఎంత డబ్బు కావాలి?"

"నీ దగ్గరున్నంత."

"అంతేనా? రా... నాతో రా... అంతా తీసుకో... సరేనా? ఏం? ఇంకేం కావాలి?"

సత్యం అక్కడున్న విస్కీ బాటిల్ చూపుతూ, "విస్కీ!" అన్నాడు.

"ఓ! విస్కీయా! ఇదిగో ఫుల్‌బాటిల్ వుంది. తాగు!"

"తోడు లేకుండానా? నువ్వూ తాగాలి."

తప్పతాగి తూలి పడిపోతున్న జగన్‌ను అలాగే మేడ మెట్ల వద్దకు లాక్కెళ్లి, పై మెట్టు మీద నుంచి ఒక్క తోపు తోశాడు సత్యం (కృష్ణంరాజు). జగన్ (త్యాగరాజు) మెట్ల మీద నుంచి దొర్లాడు. అంతే.

కృష్ణంరాజు సమర్పించే రాధాకృష్ణ మూవీస్ "శివమెత్తిన సత్యం" వన్నెల చిత్రాన్ని వి. మధుసూదనరావు దర్శకత్వంలో జి. సత్యనారాయణరాజా నిర్మిస్తున్నారు. నిర్వహణ: యు. వి. సూర్యనారాయణరాజా. ఆత్రేయ రచన, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, వి. జగదీశ్ కూర్పు తెర వెనుక హంగులు.

## "గోరింటాకు"లో కోరికల తొరుమూను

తాను మనసారా ప్రేమించిన స్వప్న జీవితం దెబ్బతిందని తెలిసి, ఆమెను చేపట్టడానికి నిర్ణయించుకొని వచ్చాడు రాము (శోభన్‌బాబు). కాని అంతకుముందే పద్మ—తనను ప్రాణప్రదంగా ప్రేమిస్తుందని ఆమెకు రాము మాట ఇచ్చాడని స్వప్న (సుజాత)కు తెలిసింది. సాటి అబల జీవితాన్ని ఎడారిపాలు చేయగలదా స్వప్న.

"నువ్వు చాలా మంచిపని చేశావు, స్వప్నా!"

"ఏమిటి? రైలు వెళ్లిపోయాక ప్లాట్‌ఫామ్ మీదకు రావడమా?"

"ఆ తర్వాత ఇంకో రైలన్నా వస్తుందిగా?"

"ఆ వచ్చిన రైలు అనుకున్న స్టేషన్‌కే చేరుతుందని గారంటీ ఏమిటి?"

"మనసే మార్గం చూపిస్తుంది. చేరాల్సిన చోటుకి చేరుస్తుంది."

"మనసా!... రామూ, మనిషికి మనసొకటే చాలదు — ధైర్యం కావాలి.. నేను నీకు మనసిచ్చాను. నువ్వు నాకు మనసిచ్చావు. నా మనసు నీదని చెప్పడానికి నీకూ ధైర్యంలేదు. నాకూ ధైర్యం చాల్లేదు. చూశావా మనమెంత పిరికివాళ్ళమో! ప్రేమికులు పిరికివాళ్ళు కాకూడదు, రామూ! పిరికివాళ్ళు సుఖపడలేరు."

"లేదు, స్వప్నా. ఇప్పుడు ధైర్యంగా చెబుతున్నాను. నిన్ను పెళ్ళి చేసుకోడానికే నిర్ణయించుకున్నాను."

"కాని, నేను నా నిర్ణయాన్ని మార్చుకున్నాను."

రాము నిర్ఘాంతపోయాడు.

కె. రామలక్ష్మి కథ ఆధారంగా దాసరి స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో కె. మురారి నిర్మించిన యువ చిత్ర వారి "గోరింటాకు" వన్నెల చిత్రం కె. నరసింహంనాయుడు సమర్పణ.

# క్రొత్తగా! వేడివేడి వడ్డనలకు ఇగ్లూ హాట్‌ప్యాక్, వండి నాలుగు గంటలైనాసరే ఎంతో కమ్మదనము



ఎంతసేపైనాసరే, 4 గంటలదాకా అప్పటి కప్పుడు వండినట్లు తాజాగా వేడిగా పొగలొస్తూ, రుచిగా కమ్మగా వుంటాయి.

**కాలము-ఇంధనము ఆదా :**

ఇగ్లూ హాట్‌ప్యాక్ వాడితే తిరిగి వేడిచేసి వడ్డించే అవసరంలేదు. ఆ రోజులు పోయినాయి. ఎంతో తీరిక వుంటుంది. ఖర్చు తక్కువగా వంట అవుతుంది. సాధారణంగా తిరిగి వేడిచేస్తే ఆహారంలో సత్తువపోతుంది.

ఇగ్లూ హాట్‌ప్యాక్ సుప్రసిద్ధమైన జనరల్ స్టోర్సులలో కావలసిన సైజులో లభిస్తుంది ఇవ్వాళే ఇగ్లూ హాట్‌ప్యాక్ ఇంటికి తీసుకు వెళ్ళండి మీకన్నీ లాభాలే. ఇంకా ఎంతో తీరిక కూడా!

**ఇదే నిదర్శనము !**

ఈ ప్యాక్‌ను రెండు నెలలపాటు వుపయోగించి పరిశోధించి, మద్రాసులో పాకశాస్త్రమునకు సంబంధించిన ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్యాటరింగ్ టెక్నాలజీవారు చెప్పినది గమనించండి "ఇందులో వేడి నిల్వశక్తి చాలా బాగా వుంటుంది తాజాతనము ఎంతమాత్రము చెడదు 8 గంటల తరువాత కూడా రుచి ఏమీ తగ్గదు ఇవి చాలా సమర్థవంతమైనవి."




**మళ్ళీ వేడిచేయడం అంటూ వుండదు :**

ఇప్పుడు వంట త్వరగా చేసుకోండి. కూరలైనా, పులుసైనా, అన్నమయినా సరే, క్రొత్తగా వచ్చే ఇగ్లూ హాట్‌ప్యాక్‌లో పెట్టి మూతపెట్టండి.

**IGLOO hotpack**

మెటోప్లాస్ట్‌వారి తయారి



మెట్టూర్ బియర్డ్‌సెల్ లిమిటెడ్

OBM 4897/TG

# సినిమా

## "మూడు ముళ్ళ బంధం"

పై పేరున ఒక చిత్రాన్ని ఆర్. అశ్వత్ నారాయణతో కలిసి నిర్మిస్తున్నట్లు చెప్పారు సిన్నలోట రఘురాం. ఈయన దాదాపు ఇరవై ఏళ్ళుగా సుప్రసిద్ధ సంస్థలలో ప్రొడక్షన్ కంట్రోలర్‌గా పనిచేసి అనుభవం, పలుకుబడి సంపాదించారు. "డైరెక్టర్లు పి. వి. రెడ్డి, సి. సంజీవి, ఈశ్వర రెడ్డి, మృణాల్ సేన్‌గార్ల దగ్గర అసోసియేట్‌గా కృషి చేసిన ముత్యాల సుబ్బయ్యకు దర్శకత్వ బాధ్యతను అప్పగించాం," అన్నారు రఘురాం. ఆర్. అచ్చప్ప సమర్పించే ఈ చిత్రంలో శరత్‌బాబు, సాక్షి రంగారావు, చంద్రమౌళి, గిరగ, నేరెళ్ళ లక్ష్మణరావు, మాధవి, పత్రిని లక్ష్మి, టి. రాజేశ్వరి, విజయభాను, కొత్త నటులు రాజేంద్రప్రసాద్, చంద్రకాంత్ పాల్గొంటారు. అప్పలాచార్య మాటలు, పి. నారాయణరెడ్డి గీతాలు రాస్తున్నారు. సత్యం సంగీత దర్శకుడు. దశరథరామయ్య ఛాయాగ్రాహకుడు. చంద్రమోహన్ సంకలనకర్త. వీణ వెంకటేశ్వరరావు నిర్మాణ నిర్వహణ. కథ, స్క్రీన్‌ప్లే కూడా దర్శకుడే రాశారు. గోమాతా ఆర్ట్ క్రియేషన్స్ పతాకంలో తయారౌతుంది చిత్రం.

## ఓ ఇంటి భాగోతంలో డాక్టర్ తాళ్ళూరి కృష్ణకుమారి

ఓ లేడీ డాక్టర్‌ను రజత అవనికకు పరిచయంచేసే ఖ్యాతి నిర్మాత ఎన్. కృష్ణంరాజుకు దక్కింది. నటి తాళ్ళూరి రామేశ్వరి సోదరి డాక్టర్ తాళ్ళూరి కృష్ణకుమారి నటించే "ఓ ఇంటి భాగోతం" వర్ణ చిత్రం షూటింగ్ డిసెంబర్ 20 న దేవదాస్ కనకాల దర్శకత్వంలో ప్రారంభింపబడుతుంది. చంద్రమోహన్, నూతన్‌ప్రసాద్, గీతాప్రసాద్, దీప, రమాప్రభ, చంకాయల, పి. ఎల్. నారాయణ, రాళ్ళపల్లి ప్రధాన భూమికలు నిర్వహిస్తారు. నవతా ఆర్ట్స్ వారి చిత్రాలలో సంగీతం విశేషాకర్షణగా వుంటుందన్న విషయం అందరూ ఎరిగినదే. ఈ చిత్రంలోని పాటలన్నీ నవంబర్ 19, 20, 21 తేదీల్లో రికార్డు చేయబడతాయని తెలియజేశారు నిర్మాత. ఎమ్వియల్ సంభాషణలకర్త. జి కె. వెంకటేశ్ సంగీత దర్శకుడు. ఎస్. ఎ. తారచాయ, సూరపనేని కళాధర్ శిల్పం, డి. వాసు కూర్పు యితర తెర వెనక హంగులు. 12 కేంద్రాలలో వందరోజులు మించిన ఈ సంస్థ ఇదివరకటి చిత్రం "ఇంటింటి రామాయణం" స్వర్ణోత్సవ వైభవం జరుపుకున్న విషయం పాఠకులకు విదితమే.

## డైరెక్టర్ వి మధుసూదనరావు చి ... జతోత్సవం

రాధాకృష్ణా మూవీస్ "శివమెత్తిన సత్యం" చిత్రంతో వీరమాచనేని మధుసూదనరావు యాభై చిత్రాలకు దర్శకత్వ బాధ్యతను నిర్వహించడం పూర్తవుతుంది. ఈ సందర్భంగా ఆయనవద్ద దర్శకత్వశాఖలో పనిచేసిన 56 మంది కృతజ్ఞతా పూర్వకంగా ఆయన్ని నవంబర్ 11న మద్రాసులో ఘనంగా సన్మానించడానికి నిశ్చయించారు. ఈ సన్మాన కమిటీ సభ్యులు – చిత్ర దర్శకులు పి. చంద్రశేఖరరెడ్డి, కె. రాఘవేంద్రరావు, ఎన్. గోపాలకృష్ణ, జి. సి. శేఖర్, కె. వి. ఎస్. కుటుంబరావు, ఎ. కోదండరామిరెడ్డి, ఎన్ బుల్లెయ్యరెడ్డి. పానెల్ కమిటీలో సి. వి. రమణ, చెర్వు ఆంజనేయశాస్త్రి, సి. గంగాధర్, పెనుమాక కృష్ణమూర్తి, ఎం. కృష్ణమోహన రెడ్డి ఉన్నారు. కన్వీనర్, కోశాధికారి : ఆర్. శ్రీనివాసరావు.



'గుప్పెడు మనసు'లో సరిత

## అత్తకుతగ్గ కోడలు

శ్రీ శివకామేశ్వరి పిక్చర్స్ వారి "మూగకు మాటొస్తే" చిత్రం పేరును "అత్తకుతగ్గ కోడలు"గా మార్చినట్లు చెప్పారు డైరెక్టర్ వి. మధుసూదనరావు. ఈ వర్ణ చిత్రంలో మురళీమోహన్, శ్రీధర్, జయసుధ, ప్రసాద్ బాబు, కె. వి. చలం మాడా, కవిత, రమాప్రభ, ఎస్. వరలక్ష్మి ముఖ్య పాత్రధారులు. బొల్లిముంత, చక్రవర్తి, కె. ఎస్. ప్రసాద్ రచన, సంగీతం, ఛాయ సమకూరుస్తున్నారు. "మూగమ్మాయిగా జయసుధ అపూర్వంగా నటిస్తోంది. రెండవ షెడ్యూల్ సెప్టెంబర్ 17 నుంచి 30 వరకు జరిగింది," అన్నారు నిర్మాత విజయకుమార్.

# మా ఊరిలోని స్త్రీలంతా ఈ సరికొత్త డిటర్జెంట్ సబ్బు బిళ్ళ గురించే ప్రస్తావిస్తున్నారు

భారతావనిలో తయారుచేయబడే డిటర్జెంట్ సబ్బులలో స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ వినూత్నమైనది. ఇంత విశిష్టవంతమైన నీలిరంగు డిటర్జెంట్ సబ్బు బిళ్ళ లోగడ మీకు పరిచయం చేయబడలేదు. మురికిని



నిర్మూలించి మిరుమిట్లు గొలిపే తెల్లదనంతోపాటు, జిగేలు వరచేటట్లుగా బట్టలను ఉతక గలందులకు నవీన పద్ధతిని మేలువరచబడినది ఈ అధునాతనమైన నీలిరంగు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ. మీ దుస్తుల స్వచ్ఛందమైన తెల్లదనానికి, పరిశుభ్రతకు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళనే వాడండి. వినూత్నమైన స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ విశిష్టమైన అంశాలను కలిగివున్నందువల్లనే మీ ఊరిలోని వనితలు యావన్మందీ దీనిని గురించే ప్రస్తావిస్తున్నారు.

## ఇదే లేటెస్ట్ స్కోర్..!




*స్కోర్ అత్యధికంగా ఆటరాగలదు. నేడే కొనండి! వాడి చూడండి!!*

**కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిమిటెడ్** (ఒక ప్రభుత్వ సంస్థ)

FDS KSDC 2797 TEL A

## నిండు నూరేళ్ళలో
## వైకుంఠయాత్రా ?

దీనానాథ్ (అల్లు రామలింగయ్య) స్టెతస్కోప్‌తో తన గుండె కొట్టుకోవడం వింటూ, "ఆఁ...గుండె కొట్టుకుంటోంది. దట్ మీన్స్-నేను బతికేవున్నా," అనుకుంటూండగా "డాక్టర్!" అన్న పిలుపు వినబడింది. దీనా ముఖం విప్పారింది. "ఎవరది? పేషెంటా! స్వాగతం! సుస్వాగతం!" అంటూ తల పక్కకు తిప్పేసరికి భార్య (సూర్యకళ) కనిపించింది. "ఛీ! నువ్వా! 'ఏమండీ!' అని మామూలుగా పిలిచి ఏడవక — 'డాక్టర్!' అని కూత ఎందుకు? పేషెంట్ అని నేను కంగారుపడ్డానికా?" అని మండిపడ్డాడు.

"అదికాదండీ. ఉదయంనుంచీ ఒళ్ళంతా నొప్పులు, వళ్ళుస్సి..."

"పో — పోవే! వున్న కాసిని మందులు తినెయ్యడానికి తయారయ్యావా? నన్ను చంపినావసరే — నీకు నేను మందివ్వను. గవర్నమెంట్ హాస్పిటల్‌కి పో!" ఇంతలో సింజాకువే శాస్త్రితో ఇద్దరు మనుషులు వచ్చారు. "ఏమిటి? ఇంతమంది పేషెంట్స్! చాలా సంతోషం రోగాలేమిటో వరసక్రమంలో చెప్పండి!"

పిచ్చి కుర్రాడు పెద్దగా నవ్వి ఎగిరి, బల్లపై నిలుచొని, "సిరెంజ్ విరిచేస్తా! సీసాలు విరిచేస్తా నిన్ను కరిచేస్తా, కాసుకో!" అంటూ సామాన్లు విసిరేయసాగాడు.



'సుబ్బారాయుడు—సుబ్బలక్ష్మి'లో కవిత

దీనా ఏడ్పుముఖం పెట్టి, "ఎవరయ్యా బాబూ ఇతను? నేను డాక్టర్ని అవడం గిట్టక నామీద పగపట్టాడా? పట్టుకోండి కరవడానికి ఉత్సాహపడుతున్నట్టున్నాడు పట్టుకోండి," అన్నాడు.

కుర్రాడ్ని పట్టుకున్న ఒకడు "చూడు, డాక్టూ! మొన్న మా బుజ్జిబాబు కడుపునొప్పికి మందేదో ఇచ్చావు. అది తాగేటప్పటికి — కడుపునొప్పి అటుంచి, వీడికి మతిపోయి యిట్లా తయారయ్యాడు. మర్యాదగా యీడిని మామూలుగా చెయ్యకపోతే ఈడిని నీమీదికి వుసిగొల్పిపోతాం. నీ డొక్కా డొక్కా కలిపి చించెయ్యగలడు," అన్నాడు.

"వాట్! నేనిచ్చిన మందుకి పిచ్చిగా తయారయ్యాడా? అసలు శక్తి వుండడమే ఆశ్చర్యంగా వుందే! సరే... విరుగుడు ఇస్తా. ఇతన్ని మామూలుగా చేసేస్తా," అంటూ ఏదో మాత్రలిచ్చి, "మన ఫీజు...?" అంటూ చెయ్యి చాపాడు దీనా.

"తగ్గనీయండి. వాడి చేత పంచెలచావులో ఫీజెట్టి యిప్పిస్తాం," అంటూ వాళ్ళు రోగిని లాక్కొని వెళ్ళిపోగానే "ఆ మాత్రతో వాడు వైకుంఠయాత్రేనేమో!" అంటూ ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టేశాడు దీనానాథ్.

జయసుధ, చంద్రమోహన్, మోహన్‌బాబు, సత్యనారాయణ, సుభాషిణి, బేబీ రేఖ, అల్లు రామలింగయ్య, కాంతారావు ముఖ్య పాత్రలు ధరించే శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "నిండు నూరేళ్ళు" వర్ణచిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మిస్తున్నారు.

'మహాలక్ష్మి'లో ఒక దృశ్యం

## బొమ్మల కొలువులో భార్యాభర్తల తగవు

శోభ (కాంచన) పిల్లలతో ఫలహారం చేస్తూండగా ధర్మారావు (జగ్గయ్య) ఆవేశంతో వచ్చి, "శోభా! నీ పద్ధతేం బాగోలేదు. ఆ పసివాడు రాందాసు చేతనే అన్ని పనులూ చేయించాలా?" అన్నాడు.

"పసి వాడి చేత పని చేయించక నెత్తి కెక్కించుకోవాలా?" అంది శోభ.

"వాడు పనివాడు కాదు — కాదు అని చెప్తున్నాను."

"కాక, మహారాజా? మన ఇంటి ఇలవేల్పా?"

"ఇలవేల్పే! నీకు పతిభిక్ష పెట్టింది వాడి తండ్రే. ఏమాత్రం ఇంగితజ్ఞానం వున్నా — వాడి తండ్రి పేరు చెప్పుకునే అన్నం తినాలి. వాడ్ని దేవుడుకంటే ఎక్కువగా పూజచెయ్యాలి."

"హుం! నా అయిదోతనం గట్టిదై, మీరు బ్రతికారు. ఆయుర్దాయం మూడి వాడి తండ్రి చచ్చాడు. చచ్చినవాడు చచ్చినట్టు పోక మిమ్మల్ని దయ్యమై పట్టి ఇట్లా పీడిస్తున్నాడు. మీకా దెయ్యం వదలకపోతే, వాడి మూలంగానే మనం చెడిపోతాంకూడా. గుర్తుంచుకోండి."

"బెదిరిస్తున్నావా, శోభా! ఒక్కవిషయం మాత్రం జ్ఞాపకం పెట్టుకో. ఆ పసివాడి ఉసురు నీకు ఎప్పటికైనా తగుల్తుంది బలహీనుడ్ని బలవంతుడు కొడితే — బలవంతుడ్ని భగవంతుడు కొడ్తాడు. జాగ్రత్త!" అంటూ ధర్మారావు చరచరా వెళ్ళిపోయాడు

ఎస్. ఎస్. మూర్తి సమర్పించే అప్పం ఆర్ట్స్ "బొమ్మలకొలువు" వర్ణ చిత్రాన్ని కొమ్మినేని దర్శకత్వంలో కాశీరాజు ప్రకాశం నిర్మిస్తున్నారు. చంద్రమోహన్, కవిత నాయకా నాయికలు.

## "త్రిలోకసుందరి"

పై పేరున ఓ వర్ణచిత్రాన్ని విజయదశమి నాడు ప్రారంభించారు పి. ఎస్. ఆర్. పిక్చర్స్ అధినేత పింజల సుబ్బారావు. శ్రీదేవి, నరసింహరాజు నాయికా నాయకులు. డిసెంబర్‌కు షూటింగ్ పూర్తవుతుంది.

'బొమ్మల కొలువు'లో
జయమాలిని, చంద్రమోహన్, పల్లవి.





'తొలికోడి కూసింది'లో మాధవి

'సంఘం చెక్కిన శిల్పాలు'లో సునీత



# సినిమా

## రామకృష్ణా సినీ స్టూడియోలో కొత్త ప్రివ్యూ థియేటర్

విజయదశమి పర్వదినాన రామకృష్ణా సినీ స్టూడియోలో అత్యాధునికమైన ప్రివ్యూ–డబ్బింగ్–రికార్డింగ్ థియేటర్‌కు ప్రారంభోత్సవం జరిగింది. పన్నెండు ఛానెల్స్ రికార్డింగ్ సదుపాయం గల విశాలమైన థియేటర్ ఇది. ఈ సందర్భంలో ఇప్పుడున్న సబ్సిడీ విధానంపట్ల తన అసంతృప్తిని తెలియజేశారు ఎన్. టి. ఆర్. "ఈ సబ్సిడీవల్ల జరిగిందల్లా ఏమిటంటే — సందుల్లో, వంటగదుల్లో సినిమాలు తీసి సబ్సిడీ తీసుకుపోయేవాళ్ళే ఎక్కువవుతున్నారుగాని, చిత్ర పరిశ్రమకు ఏ విధంగానూ సంతోషకరంగా లేదు. దీనివల్ల అభివృద్ధి చెందుతున్నది చిత్ర పరిశ్రమ కాదు; వ్యక్తులు," అన్నారు కర్నాటక రాష్ట్రంలోలాగా డబ్బింగ్ చిత్రాలను రానివ్వకూడదన్నారు.

## ఛాలెంజ్ రాముడు

"మా నాల్గవచిత్రం షూటింగ్ పూర్తయింది. డిసెంబర్‌లో విడుదల చేయబోతున్నాం," అన్నారు అనిల్ ప్రొడక్షన్స్ అధినేత తాతినేని ప్రకాశరావు. వారి పుత్రుడు డైరెక్టర్ టి. ఎల్. వి. ప్రసాద్ "ఈ చిత్రానికి 'ఛాలెంజ్ రాముడు' అని పేరు పెట్టాం," అన్నారు. ఈ వన్నెల చిత్రంలో ఎన్. టి. ఆర్., జయప్రద, గీత, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, ఉమ్మడి, మిక్కిలినేని, రాళ్ళపల్లి, సత్యకళ, పుష్పలత, జయమాలిని ముఖ్య భూమికలు నిర్వహించారు. మహేంద్రన్ కథకు జంధ్యాల మాటలు రాశారు. ఆత్రేయ, వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. తోట శిల్పదర్శకుడు నిర్వహణ: పి. కృష్ణమూర్తి, మహాందాత.

## ధర్మం దారి తప్పితే....?

"ఈ చిత్రం సామాజిక వ్యవస్థ మీద చెరుగుబాటులాంటిది," అన్నారు "ధర్మం దారి తప్పితే...?" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే రాసి, దర్శకత్వం వెలిపిన శ్రీనివాసరెడ్డి. రంగనాథ్, చంద్రమోహన్, ప్రభ, ఉషాచౌదరి, త్యాగరాజు, రాజనాల, సాక్షిరంగారావు, కె. వి. చలం, చిట్టిబాబు ప్రభృతులు పాల్గొన్నారు. భీశెట్టి రచయిత. ఎం. రంగారావు సంగీత దర్శకుడు. "షూటింగ్ పూర్తయింది. త్వరలో విడుదల చేయబోతున్నాం," అన్నారు నిర్మాత ఎస్. శకుంతలాదేవి.

## జాతీయ పార్టీ

ఉత్తర భారతంలోని చలన చిత్ర పరిశ్రమ 'నేషనల్ పార్టీ ఆఫ్ ఇండియా'ను ఏర్పాటు చేసింది ఈ పరిశ్రమలో అగ్రశ్రేణిలో ఉన్న ప్రముఖుల్ని, పార్టీ ప్రమేయం లేని మేధావుల్ని, పారిశ్రామికవేత్తల్ని రాగల లోక్‌సభ ఎన్నికల సందర్భంలో పోటీలో నిలబెట్టదలచుకున్నట్లు పార్టీ కన్వీనర్ జి. పి. సిప్పీ అన్నారు. ఈ పార్టీ కేవలం చిత్ర పరిశ్రమ శ్రేయస్సుకోసమే పోరాడదనీ, జాతీయ ప్రగతికీ కృషి చేస్తుందని సిప్పీ చెప్పారు.

## ఇరుగు - పొరుగు

★ దాసరి రచన, దర్శకత్వంలో నిర్మించే వన్నెల చిత్రానికి "బండోడు గుండమ్మ" అనే పేరు నిర్ణయించదలచినట్లు విజయలక్ష్మి మూవీస్ అధినేత జి. వి. ఎస్. రాజు తెలియజేశారు.

★ దాసరి దర్శకత్వంలో ఎ. ఎన్. ఆర్., జయసుధ నటించే "పిడుగుతుస్తల మేడ" వన్నెల చిత్రంలో జయప్రద గెస్ట్‌గా కనిపిస్తుంది.

'ఆర్ట్ ఫిలిమ్' గురించి ఇద్దరి అభిప్రాయాలు:

"దారిద్ర్యాన్ని, ఈతిబాధలను తెరపై చూపెట్టేవే 'ఆర్ట్ ఫిలిమ్స్' అని నా అభిప్రాయం. వివాహమవకుండా సోదరి గర్భవతి అయిందని తెలుసుకొని, విరక్తితో సోదరుడు పారిపోవడంలాంటి సన్నివేశాలుండేవి ఆర్ట్ ఫిలిమ్స్," అంది మలయాళ నటి జయభారతి.

"ఏమాత్రం వినోదం లేకుండా నత్తగుల్లలా నడిచేది. నిరాశా నిస్పృహలతో క్రుంగిపోయిన వారినో, 70 ఏళ్ళు పైబడిన వారినో రంజింపచేసే చిత్రం. అవార్డులు వస్తాయిగాని, నిర్మాతల కొంపముంచే చిత్రాలు," అన్నాడు గుల్జార్‌రాయ్.

★ సత్యజిత్‌రాయ్ చిత్రం "సత్రంజ్ కి ఖిలారి" లండన్ 'అకాడమి' థియేటర్‌లో 25 వారాల ప్రదర్శనకు గ్రాస్ 25 లక్షల రూపాయలను ఆర్జించింది

★ అమితాబ్‌బచ్చన్, శత్రుఘ్నసిన్హా కలిసి నటించడం మానేశారు. నిర్మాణంలో వున్న ఓ అమితాబ్ చిత్రంలో సిన్హా స్థానే శశికపూర్ బుక్ చేయబడ్డాడు.

★ కరెక్ట్ టయిమ్‌కు షూటింగ్‌కు హాజరయ్యే కొద్దిమంది నటులలో ప్రాణ్ ఒకడు. "తాఖత్" అనే చిత్రం నిర్మించే రాజ్‌గ్రోవర్ ఒక విచిత్రమైన కోర్కె కోరాడు ప్రాణ్‌ని. "దయచేసి కాల్‌షీట్ టయిమ్‌కు ఒక గంట ఆలస్యంగా వచ్చి మాతో సహకరించండి," అని కోరేసరికి ప్రాణ్ ఫకాలున నవ్వాడట.

★ అమ్జద్‌ఖాన్ విపరీతంగా సిగరెట్లు, తేనీరు తాగడం చూసిన మిత్రుడొకడు - అవి ఎంత తగ్గిస్తే, అంత మంచిదన్నాడు. "ఇష్టంకొద్దీ సేవించి, తృప్తిగా అనుభవించి, ముసలితనం రాకముందే పోవడం మంచిది. అలాకాక — పండుముసలినై, నడవలేక పలుగురూ మోసుకెళ్ళే స్థితిలో జీవించడంవల్ల ఏం ప్రయోజనం?" అని జవాబిచ్చాడట అమ్జద్‌ఖాన్.

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, క్రొంగొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దినపత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# సినిమా

### పద్మసాయి ఆర్ట్ పిక్చర్స్

కె. శోభారాణి రాసిన చక్కని సామాజిక నవలను తెరకెక్కించడానికి పూనుకున్నారు పదాల నరసిరెడ్డి, మెర్ల చంద్రారావు అనే మాదేపల్లికి చెందిన అభ్యుదయభావాలు గల యువకులు. ఇంతవరకు ఆత్రేయ, దాశరథి రాసిన పాటలు గీతాలను జె. వి. రాఘవులు స్వరకల్పనలో రికార్డ్ చేశారు "నటీనటులను ఎన్నుకున్న వెంటనే కోనసీమ ప్రాంతాలలో షూటింగ్ ప్రారంభమవుతుంది," అన్నారు డైరెక్టర్ డి. ఎస్. ప్రకాశరావు. దాసం గోపాలకృష్ణ వచనకర్త. యోగానంద్ ఛాయాగ్రాహకుడు. కె. ఎస్. రావ్ శిల్ప దర్శకుడు. నిర్వహణ: కొప్పినీడి సుబ్బారావు.





'శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి మహాత్మ్యం'లో ప్రియవదన

### కొమ్మినేని కొత్త చిత్రం

అక్టోబర్ 1న చిత్రీకరణ ప్రారంభమైన త్రిశూల్ ఆర్ట్ పిక్చర్స్ "ఇన్‌స్పెక్టర్ పరశురామ్" వన్నెల చిత్రంలో కృష్ణంరాజు, సీమ, జగ్గయ్య, గుమ్మడి, గిరిబాబు, త్యాగరాజు ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు సత్యానంద్, చక్రవర్తి, భాస్కరరావు, సాయి తెరవెనుక కృషి చేస్తున్నారు. టి. కె. పి. చౌదరి సమర్పణలో చినిమిల్లి గంగాధర్ ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

### 'హరిశ్చంద్రుడు'

విశ్వశాంతివారి పై సాంఘిక చిత్రం షూటింగ్ అక్టోబర్‌లో ప్రారంభమై డిసెంబర్‌కు విడుదలవుతుందని తెలిపారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం నిర్వహించే యు. విశ్వేశ్వరరావు. ఈయనతోపాటు గీతాలను శ్రీశ్రీ రాస్తున్నారు. కొండవీటి కవి సంభాషణలకర్త. ★

# బొమ్మల మహాభారతం — యక్ష ప్రశ్నలు — మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )
























[ఇంకా ఉంది]

# ధర్మపథం

## భగవంతుని ఉనికి

నిండు సభలో భీష్మాదుల యెదుట, తన భర్తలైన పాండవులు చూస్తూ ఉండగా కౌరవులు ద్రౌపది కొప్పు పట్టి ఈడ్చుకొని రావడమే కాకుండా, ఆమెను వస్త్ర విహీనను గా చెయ్యడానికి సిద్ధపడ్డారు. ధర్మానికి కట్టుబడి ధర్మరాజు ఊరుకున్నాడు. అతని తమ్ములు అతని ఆజ్ఞను మీరలేరు. అట్టి నిస్సహాయ స్థితిలో ఆమె శ్రీకృష్ణుని తలచుకొని, ఆయనను సంబోధించి ప్రార్థింపగా, కొంత సేపటిలో ఆయన రక్షించాడు. ఈ విషయం అందరికీ తెలిసి యున్నదే !

తర్వాత కొంత కాలానికి పాండవులూ, ద్రౌపది, శ్రీకృష్ణుడు మున్నగు వారందరూ కూర్చుండి ఇష్టసంభాషణలు జరిపినప్పుడు ప్రసంగవశాత్తూ యీ సంఘటన ప్రస్తావనకు వచ్చింది. "భగవంతుడూ, పాండవపక్షపాతి అయిన శ్రీకృష్ణుడు, ద్రౌపదీ దేవి "కృష్ణా!" అని స్మరించినంతనే ఆమె మానాన్ని కాపాడి, రక్షించవలసి ఉన్నది. కాని, ఆమెను రక్షించడంలో కొంచెం జాప్యం కలిగింది. ఇలా ఆలస్యం కలగడానికి కారణమేమిటి? శ్రీకృష్ణునికి ఆమెపై అభిమానం లేదా? కొంతసేపు ఏడిపించిన మీదటనే ఎందుకు రక్షించవలసి వచ్చింది?" అనే ధర్మ సందేహం కలిగింది. దాని విషయమై చిన్న విమర్శ కూడా బయలు దేరింది. ఇది శ్రీకృష్ణుని సమక్షంలోనే జరిగిన సంఘటన!

అప్పుడు శ్రీకృష్ణుడు ద్రౌపదిని చూచి "అమ్మా! నువ్వు అప్పుడు నన్ను ఎలా సంబోధించి ప్రార్థించావో జ్ఞప్తిలో ఉందా?" అని అడిగాడు. ఆమె "కృష్ణా! ద్వారకావాసా! బృందావన నిలయా! నన్ను రక్షించు, రక్షించు' అని ప్రార్థించినట్లు చెప్పింది. అప్పుడు కృష్ణుడు "ఔనా మరి! ద్వారక, బృందావనం దూరంగా ఉన్నవి కదా! అక్కడ వున్న కృష్ణుడు రావడానికి కొంత సేపు పడుతుందా? లేదా? ఆలోచించండి. అలా సంబోధించక 'నా హృదయంలో నివసిస్తూ ఉన్న కృష్ణా!' అని సంబోధిస్తే వెంటనే రక్షణ కలిగి వుండేది. శ్రీకృష్ణుడు ఎక్కడో ఉన్నాడని అనుకొని, తన హృదయంలో లేడనుకొని భ్రాంతి పడడం వల్లనే యిలా కొద్ది ఆలస్యం జరిగింది" అని సమాధానమిచ్చాడు.

'భగవంతుడు ఎక్కడో ఉన్నాడు, ఇక్కడ లేడు' అనే భ్రాంతి వల్లనే ఎన్నో అవకతవకలు, అనిష్టమైన సంఘటనలు జరుగుతూ ఉంటాయి. భగవంతుని సర్వవ్యాపిత్వాన్ని గుర్తుంచుకోవాలి.

— *బులుసు వేంకట రమణయ్య*

---

## ప్రేమ పాశం

(14వ పేజీ తరువాయి)

అన్న విష్ణువర్ధన్ మాటలు శాంతి హృదయంలో బాగా నాటుకున్నాయి.

"యెప్పటికైనా [illegible] నర్సింగ్ హోం కట్టించుకోవాలి." అనుకుంది.

లలిత వెళ్ళిపోయిన తర్వాత తులశమ్మ ఇదివరకులా యెక్కువగా మాట్లాడడం లేదు. కూతురికి కావల్సినవన్నీ శాంతి కొనిచ్చిందని చిన్న కూతురిద్వారా తెలిసిన తర్వాత ఆమెలో ఆవేశం తగ్గింది. కూతురలా చెయ్యడం కోపం తెప్పించినా తల్లిగా బిడ్డ సౌఖ్యాన్ని కోరడం సహజం. తనకు భయపడే శాంతి అలా చేసిందనేందుకు ఆ విషయం ఆమె తనతోనే కాదు, ఇంట్లో యెవ్వరికీ చెప్పలేదు. లలిత స్కూల్లో సుమిత్రకు చెప్పింది. ఇంట్లో పని లలిత బట్టలు, ఆమెకని చేయించిన గొలుసు గాజులు కూడా ఇచ్చి వచ్చింది. ఇదంతా తనకు భయపడే చేస్తున్నాదని యెలా అనుకోడం?

నాలుగు రోజుల తర్వాత యేమాలోచించిందో యేమోగాని సుమిత్రను ఉద్యోగం మానెయ్యమన్నది. సుమిత్ర యెదురు చెప్పలేదు.

* * *

జానకితో ఈ ప్రయాణం ఇద్దరి మధ్యా యేర్పడిన దూరం తగ్గించి ఆమెకు పూర్వపు వుత్సాహం కలిగిస్తుందనుకున్న మనోహర్ ఆలోచన పూర్తిగా తల్లక్రిందులయింది.

బెంగుళూరు వచ్చి హోటల్లో రూమ్ బుక్ చేసుకోగానే క్షేమంగా చేరానని వ్రాసిన అతడి లెటర్‌కు శాంతి నుండి జవాబుగా ఆ రోజు వచ్చిన లెటర్ అతడికి శాంతిని మరింత సన్నిహితం చేసింది.

చేరువ నున్న జానకి తన మనసు నేమాత్రం మార్చుకోలేక పోవడంతో శాంతి గురించిన ఆలోచన్లతో గడిపే అతడికి కుటుంబ విషయాలన్నీ వివరపరిచి "మనూ, నా వల్ల తప్పేమైనా జరిగిందా?" అని ఆవేదనగా ప్రశ్నిస్తే, "లేదు శాంతీ లేదు. నావల్లే నీవింత బాధ పడాల్సి వచ్చింది" అనుకున్నాడు.

"మీ సాన్నిధ్యంలో వుండే వుత్సాహం సంతోషం ఇప్పుడు లేవు. నాలో శక్తంతా మీ వెంటే తీసుకెళ్ళారా?" శాంతి మాటలు హృదయాన్ని పులకింప చేస్తున్నాయి.

"జానకి గారెలా వున్నారు?" ఆ ప్రశ్నకతడు నిర్లిప్తంగా నవ్వుకున్నాడు.

జానకి తనకు ఆత్మీయురాలిగా తప్ప, అర్ధాంగిగా వుండలేదనుకుంటే ఆమె కన్యాయం చేశానని బాధ కలుగుతుంది. కాని ఇప్పుడు చెయ్యగలిగేదేమీ లేదు. అతడి కండ్ల ముందు నాలుగు రోజుల క్రిందటి రాత్రి జరిగిన సంఘటన మెదిలింది.

హోటల్ మేడ మీది గదిలో, కిటికీ గుండా బైటికి చూస్తున్న జానకికి దగ్గరగా వచ్చాడు. అతడామె కాదన్న తర్వాత సన్నిహితంగా వచ్చిన రోజదే.

ఆనాటి నుండి ఆమెను చూడగానే యేదో తప్పు చేసినట్లనిపించి ఆవేశం చల్లారుతుంది. కోర్కెలు అణగారుతాయి. కాని ఆమెకు ప్రశాంతత కలిగించాలంటే తప్పని సరిగా ఆమెకు చేరువవ్వాలనుకున్నాడు.

"జానకీ, ఈ దూరం తరగాలి." ఆవేశమో, ఆవేదనో తెలియని స్వరంతో అంటూ ఆమె భుజం మీద చెయ్యి వేశాడు.

"నేనూ అలాగే అనుకున్నాను... కాని మీ గుండెలో మరో రూపు వుందన్న తలంపు నన్ను మీ నుండి దూరంగా నెట్టేస్తున్నది. నేను చాలా చెడ్డదాన్నండి. అందుకే మీకు దగ్గర కాలేకపోతున్నాను." ఆమెకు తెలియకుండానే దుఃఖం ముంచుకొచ్చింది.

అతణ్ణి చూడనిది ఉండలేదు. అతడి మాటలు వినకపోతే యేదో పోగొట్టుకున్నట్లనిపిస్తుంది అతని బాధను చూడలేదు.

**ముందు మయ్యి వెనక పోలీసు**

నామగిరిపేటకు చెందిన పెరియకురిచ్చి గ్రామంలో 22 ఏళ్ళ సెల్వం అనే కుర్రాడు కొబ్బరికాయలు దొంగతనం చేసి దారుణంగా పట్టుబడిపోయాడట. ఊళ్ళోవాళ్ళు చేతులు కట్టేసి పోలీసు స్టేషనుకు తీసుకుపోతే అక్కణ్ణుంచి పోలీసులు అతన్ని జీపులో ఎక్కించి నామగిరిపేట పోలీసు స్టేషనుకు పట్టుకు పోతూండగా సెల్వం మధ్యదారిలో జీపులోంచి ఎగిరిగంతేసి పారిపోయాడట. పోలీసులు తరుముకు రావడం వెనక్కి తిరిగి చూస్తూ, చూస్తూ పరు గెట్టి దిగుడుబావిలో పడి, ఆపాటుకు తలపగిలి చనిపోయాడట.

**రెండో పెళ్ళి వద్దన్న మొదటిభార్య హత్య**

క్రిష్ణగిరికి చెందిన వాళతోటత్తుకళ్ళం అనే గ్రామంలో గోవిందసామి అనే 27 ఏళ్ళ వ్యక్తి 17 ఏళ్ళ చంద్ర అనే అమ్మాయిని రెండో పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటే, మొదటిభార్య 22 ఏళ్ళ ఉణ్ణా మలై అనే ఆమె భర్తతో పోట్లాడి పుట్టింటికి వెళ్ళి పోయిందట. చంద్రమ పెళ్ళి చేసుకున్న గోవింద సామి మొదటిపెళ్ళాన్ని తనతో వచ్చి కాపురం చేయమని శాసించాడట. దానికామె లక్ష్యపెట్టలేదని పీకనులిమి చంపేశాడట.

అతను నీ వెంటపడట్లేదు.. వెనకాల
తా రాజున్న తరుముకొస్తోంది!! అతన్ని






# "సాంప్రదాయ సిద్ధమయిన భారతీయ ఔషధాలకి ప్రత్యేకమయిన శక్తివుంది.

# ఉదాహరణకి, అమృతాంజన్."

ప్రకృతిలో లభించే అత్యంత శక్తివంతమయిన పది మూలి ఔషధాలతో అమృతాంజన్ తయారు చేయబడుతోంది. అంటే అమృతాంజన్ చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్ తలనొప్పులకు, జలుబులకు, వంటినొప్పులకు, బెణుకులకు శీఘ్రంగానూ, నిశ్చయంగానూ ఉపశమనం కలిగిస్తుంది. అంతేకాదు అమృతాంజన్ సురక్షితమయిన బాధా నివారిణి

**అమృతాంజన్ :**
**80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్య ఔషధము**

AM-2148

# అమృతాంజన్

## తలనొప్పులకు .జలుబులకు. వంటినొప్పులకు.బెణుకులకు



# డాక్టరు సలహాలు

— డా॥ కె. వెంకటేశ్వరరావు

**కె. ఆర్. ఆర్. — భద్రాచలం**

మా పాపకి 3 సంవత్సరములు. ఇప్పటివరకూ నడవటంలేదు. పట్టుకొని మాత్రం నిలుచో గలుగుతున్నది. అప్పుడప్పుడూ అమ్మా, నాన్న అనిమాత్రం అనగలుగుతోంది.

పిల్లలు ఇలా క్రమంతప్పి బాల్యదశలోని మైలురాళ్ళని దాటలేకపోవటం, శిశువు తల్లిగర్భంలో ఉండేటప్పుడు, ప్రసవసమయంలోనూ ఏర్పడిన కొన్ని అవాంతరాలవల్ల జరుగుతుంది.

తల్లి గర్భవతిగా వున్నప్పుడు రాగల టాక్సీమియా శిశు నిర్మాణంలోని కొన్ని అవలక్షణాలు, మొదలయిన వాటవల్ల శిశువు మెదడు పరిపక్వం చెందక మీరు వ్రాసిన లక్షణాలు ఏర్పడతాయి. దీనినే మెంటల్ డెఫిషియన్సీ అంటారు. ఇలా రావటం వల్ల రైలు రెండుగంటలు లేటు అన్నట్లు పాప కూడా 1లేక 2సం.లు లేటుగా ఈ మైలురాళ్ళని దాటుతుంది.

**కె. ఎన్. జి. — కొవ్వూరు**

మా అబ్బాయికి 4నెలల క్రితం చేతిమీదకురుపు లేచినది. అది ఇప్పటికీ మానలేదు. ఆస్పత్రికి తీసుకొని వెడితే ఎముకకు చీము పట్టినది. ఆపరేషను చెయ్యాలన్నారు. ఆపరేషన్ అంటే భయముగావున్నది.

కురుపులు రాగానే తగువైద్యము చెయ్యకపోతే ఈ కురుపులలోని చీము క్రిందవున్న ఎముకకు విస్తరించటం సహజం. దీనిని ఆస్టియో మైలైటిస్ అంటారు. ఎముకలోని ఒక భాగం చీముపట్టటం వల్ల ఆ భాగం పుచ్చినట్లవుతుంది. ఆ భాగాన్ని సెక్వెస్ట్రం అని అంటారు. దీనికి యాంటిబయాటిక్ లతో పాటు శస్త్రచికిత్స ద్వారా ఆ పుచ్చిన ఎముక భాగాన్ని తీసివేయడమే మంచి మార్గం.

**ఆర్. ఎస్. ఆర్. - కర్నూలు**

నాకు ఏడవ నెలలోనే బాబు ప్రాణములేకుండా పుట్టాడు. వాని తలభాగము అణచివేయబడినట్లు మెడవద్ద నరములు బయటికి కన్పించాయి. ఇటువంటివి ఎందుకు జరుగుతాయి? ముందు ముందు కూడా ఇలాగే జరుగుతుందా?

స్త్రీ—పురుష సంయోగం తర్వాత వారి బీజాణువుల విభజనం జరిగిన సమయం నుంచి, శిశువు జన్మించే దాకా ప్రతిక్షణం జరిగే కణవిభజన రసాయనిక, భౌతిక మార్పుల విధానాన్ని తెలుసుకుంటే, మనందరమూ ఎందుకు అంగవైకల్యం లేకుండా పుట్టామా అనే ప్రశ్న తప్పక ఉదయిస్తుంది. ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌లో మాత్రమే కనపడే జీన్ అనే జీవకణాలోని పరమాణువులు, రెండు వరుసలలో కొన్ని అమైనో యాసిడ్‌ల పరంపరలను కలిగి వుంటాయి. వీటికి కొన్ని నిర్ణయింపబడిన స్థానాలు వుంటాయి. పొరపాటున ఒక అమైనో యాసిడ్ ఇంకొకదాని స్థానంలోనికి వెడితే శరీరంలో కొన్ని మార్పులు వస్తాయి. పైన మీరు వ్రాసినది కూడా ఈ తెగకు చెందినదే. ప్రతిసారీ ఇలా అవుతుందని ఆందోళన చెందటం అనవసరం.

**కె. వి.ఎస్. వి.పి. — అమలాపురం**

నాకు 15 సంవత్సరములుగా నడుములో నెప్పి వున్నది. ఇర్గాపైరిన్ మాత్రలు వేసుకుంటే తగ్గేవి. ఎక్సరే తీసి ఆంకైలోసింగ్ స్పాండిలైటిస్ అన్నారు. దీనికి నివారణ ఏమిటి?

ఆంకైలోసింగ్ స్పాండిలైటిస్ అంటే వెన్నుపూసలు ఒకదానికొకటి బాగా అతుకుకొని సహజమైన కదలికలు లేకుండా వుండటమే. ఇలా వున్నప్పుడు వెన్నుపామునుండి వెలువడే నరములు రాపిడిచెంది, నడుమునొప్పి, కాళ్ళు సత్తువలేకుండా వుండటం, వెన్నెముకలో నెప్పి ఏర్పడతాయి.

దీనిని పూర్తిగా నయం చెయ్యటానికి ప్రస్తుతం మందులులేవు. తాత్కాలికంగా మందులు వాడితే ఉపశమనం లభిస్తుంది. ఇర్గాపైరిన్, మిల్లికార్టన్, ఫినైల్ బ్యూటాజోన్, ట్రయాక్టిన్ మొదలగు మాత్రలు వైద్యుల పర్యవేక్షణలో వాడవలసి వుంటుంది. ఎక్సరే కిరణములు కూడా ఇలా ఉపశమనం కలిగిస్తాయి.

**యం. ఆర్. — చీరాల**

నా వయస్సు 19 సంవత్సరములు. 2 సంవత్సరముల నుండి ముక్కులోంచి రక్తము పడుతోంది, 15 రోజుల కొకమారు ఇలా జరుగుతోంది. దీనికి ఏమి చెయ్యాలి?

ఈ వయస్సు వాళ్ళలో ఇలా తరచూ ముక్కులో నుండి రక్తము కారటం ముఖ్యంగా, రక్తనాళముల కూడిక అంటే వైద్యరీత్యా హిమాంజియోమా అనే రోగం వల్ల విటమిన్ సి లోపం వల్ల, ముక్కులో అదనంగా కండ (పాలిప్స్) పెరగడం వల్ల జరుగుతుంది.

మీకు దగ్గరలో వున్న ఇ.ఎన్.టి. వైద్యులను సంప్రదించండి. వారు రోగ నిర్ధారణ చేసి దానికి తగిన చికిత్స చెప్పగలుగుతారు.

**ఎ. వి ఎస్. — వరంగల్**

నాకు 23 సంవత్సరములు. కుడి కంట్లో కొద్ది పొర ఉన్నది. దీనిని తొలగించవచ్చా? ఎక్కడ వీలవుతుంది?

కంటిలో పొర [illegible] వుంటే నేత్ర వైద్యులు పరీక్షించి వీలయితే కళ్ళజోడు వ్రాసివ్వటం ద్వారా, లేక కొన్ని పరిస్థితులలో చిన్న శస్త్రచికిత్స ద్వారా సరిచెయ్యగలరు.

ఈ సహాయం పెద్దపెద్ద ఆస్పత్రులు గల పట్టణాలలో లభ్యమవుతుంది.

# THE ONLY YELAKKAI CUSTARD CREAM BISCUITS




It's real
and it lingers...
Every True Yelakkai
Custard Cream Biscuit is
full of the goodness of
custard cream and the exciting
tang of natural Yelakkai (Cardamom).

**Something special for someone special**




Manufactured by:
India's most modern
Flour-Milling and biscuit
manufacturing complex.

**TRUE**

**yelakkai Custard Cream Biscuits**

Headstart/AT/205

**జేబు దొంగలు :**

జేబు దొంగలు అంటే సినిమా అనుకోవేరు. కాదు. నిత్య జీవితంలో జంట నగరాలలో నగర వాసులకు ఎప్పుడో ఒకప్పుడు తరచు పడుతున్న పురానా వారు. దొంగలు అని ఎవరి మొహం మీద వ్రాసి పెట్టి ఉండదు కదా! మనతో పాటే బస్సు ఎక్కుతారు, కూర్చుంటారు. బస్సు దిగే వేళకు మన బనియన్ జేబులో భద్రంగా దాచుకున్న డబ్బు కూడా కనిపించదు. చేతికి అంటలేదు, జేబు పాడు మాలలో ఉండేపోనని వెతికితే, మూలలనుంచి వేళ్ళు ఇవతలికి వస్తాయి. ఏమిటీ ఈ వింత అని పరిశీలనగా చూసుకుంటే బనియన్ జేబు కింద పరుసగా కోత కనిపిస్తుంది. ఒంటికి అంటిపెట్టుకొని ఉన్న బనియన్ జేబును కోసిన ఆ మేధావి క్రైవడనికి (నైపుణ్యానికి) అనందించవచ్చు. రసాస్వాదన: అనుకోవే సాహిత్య వేత్తలు ఈ చాతుర్యాన్ని కొనియాడుతారేమో గాని, సామాన్య బస్సు ప్రయాణికులు ఆందోళన పడడం సహజం. జేబు దొంగల విషయమైన పోలీసుల నిర్లక్ష్యం చేస్తున్నారనే ఫిర్యాదులకూడా వినవస్తున్నవి. కేవలం ఆర్. టి. సి. బస్సులలోనే నగటున రోజుకు 25 జేబు కత్తిరింపులు జరుగుతున్నావని నేర పరిశోధన విభాగం డిప్యూటి కమీషనర్ తెలిపారు.

**రాజమన్నారుకు ముఖ్యమంత్రి జోహార్లు :**

ప్రముఖ నాటకకర్త, సాహిత్య వేత్త, కళా ప్రియుడు, మద్రాసు హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి.వి. రాజమన్నారు అక్టోబరు 1న తేదీన మద్రాసులో మరణించడం వల్ల వివిధ రంగాలకు ఎంత నష్టం కలిగిందని ముఖ్యమంత్రి డక్టర్ చెన్నారెడ్డి సంతాపం ప్రకటించారు. ఆయన లోటు పూరింపరానిదని అయన అన్నారు. శ్రీ రాజమన్నారు వయస్సు 79 సంవత్సరాలు. ఆయనకు నలుగురు కుమార్తెలు న్నారు. ఆయన తండ్రి పి.వి. వెంకట రమణారావు కూడా న్యాయమూర్తి. ఆయన మైసూరు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పని చేశారు. శ్రీ రాజమన్నారు, స్వాతంత్ర్యానంతరం మద్రాసు హైకోర్టుకు ప్రధాన న్యాయమూర్తి అయిన తొలి భారతీయుడు. 15 సంవత్సరాలు ఆయన ఆ పదవిలో ఉన్నారు. 1971లో డి.ఎం.కె. ప్రభుత్వం నియమించిన కేంద్ర రాష్ట్ర సంబంధాల పరిశీలనకు నియమించిన సంఘానికి రాజమన్నార్ అధ్యక్షత వహించారు. 16 సంవత్సరాల పాటు కేంద్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా ఉన్నారు. నాల్గవ ఆర్థిక కమిషన్ అధ్యక్షుడుగాను, దామోదర్ లోయ కార్పొరేషన్ వ్యవహారాల మధ్యవర్తిగాను ఉన్నారు. ఆంధ్ర, అన్నామలై, మద్రాసు విశ్వ విద్యాలయాలు ఆయనను డాక్టరేట్ బిరుదంతో గౌరవించాయి. ప్రధాన న్యాయమూర్తిగా ఆయన గొప్ప సంప్రదాయాలు నెలకొల్పారు. హైకోర్టు సిబ్బంది ప్రేమాదరాలను

# హైదరాబాద్ నోట్ బుక్

— తిరుమల రామచంద్ర



డా॥ పి. వి. రమణ

ప్రముఖ రచయిత, నాటక కర్త శ్రీ పి. వి. రమణకు ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు తెలుగులో సాంఘిక నాటకంపై పరిశోధన చేసినందుకు "డాక్టరేటు" ప్రదానం చేశారు.

చూరగొన్నారు. న్యాయశాస్త్ర వేత్తగా, న్యాయమూర్తిగా కన్నా కేసుల ఆధారంగా యథార్థగాథలు వ్రాశారు. వాటిలో ఆయన న్యాయశాస్త్ర నైపుణి, న్యాయదృష్టి కానవస్తాయి. శ్రీ రాచ పుద్దారు 'కా' ధర్మంత గొప్ప న్యాయశాస్త్ర వేత్తను, కళా పోషకుని, నాటక కర్తను ఆంధ్ర జాతి కోల్పోయింది.

**హైదరాబాద్ యూనివర్సిటీ విద్యార్థుల సమ్మె:**

హైదరాబాద్ యూనివర్సిటీ విద్యార్థులు సెప్టెంబరు 25వ తేదీనుంచి సమ్మె ప్రారంభించడం వల్ల విశ్వవిద్యాలయ కార్యక్రమాలు స్తంభించి పోయాయి. విద్యార్థి సంఘం కోర్కెలు పరిష్కారం కావాలని, ఇరుకైన గ్రంధాలయాన్ని విశాల ప్రాంతానికి తరలించాలని విద్యార్థులు కోరారు. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు వివిధ విభాగాల అధ్యక్షులతో చర్చించి, ప్రొఫెసర్ నాగరాజు అధ్యక్షుడుగా ఒక సంఘాన్ని నియమించారు. ఈ సంఘం కాలలోగా విద్యార్థుల కోర్కెలను పరిష్కరించవలసి ఉంది.

**పత్రికా రచయితలకు ముఖ్యమంత్రి సలహా:**

సంఘాన్ని తీర్చిదిద్దడంలో పత్రికా రచయితలకు బాధ్యత ఎంత ఉందని ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి సెప్టెంబర్ 22న జూబిలీహాల్లో జాతీయ పత్రికా రచయితల సంఘం కార్యవర్గ సమావేశం సందర్భంగా సలహా ఇచ్చారు. వార్తలను, వ్యాఖ్యలను వివేచనతో ఇవ్వాలని, రాజకీయవేత్తలతో సహజీవనం అవసరమని ముఖ్యమంత్రి పత్రికా రచయితలకు సూచించారు. సంఘంలోని అన్ని వర్గాలవారు తమ అవసరాలే కాక బాధ్యతలను కూడా గుర్తిస్తే సమాజం ఉన్నత స్థితికి పోగలదని ఆయన అన్నారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ శివలెంక రాధాకృష్ణ ముఖ్యమంత్రికి, సభ్యులకు స్వాగతం చెప్పారు.

**ప్రశతి:**

"బిల్లా రంగాలు పిల్లలను చంపిన దుర్మార్గులు గదా. వారిని మనం చంపితే ఏమి?" అని అడిగింది, అమాయకంగా 7వ తరగతి చదువుతున్న కుమార్తె చింతపల్లి గీత. దుర్మార్గంపైన పిల్లల మనస్సు ఎంత తీవ్రంగా ఆలోచిస్తుందో! అనుకున్నాను. "వాళ్లను చంపడం మన పని కాదమ్మా, ప్రభుత్వం పని" అన్నాను. "ప్రభుత్వం న్యాయం చేయదా?" అని మరొక ప్రశ్న వేసింది గీత. "ప్రభుత్వం న్యాయాన్యాయాలు పరిశీలించి, జనానికి క్షేమం చేస్తుంది." అన్నాను. నా సమాధానం గీతకు నచ్చలేదనుకుంటాను, మూతి విరుచుకుంటూ వెళ్లిపోయింది.

# అవీ-ఇవీ-అన్నీ

## హైదరాబాద్‌లో సాహిత్య వర్క్‌షాప్

హైదరాబాద్ ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో విశ్వసాహితి సాహిత్య సాంస్కృతిక సంస్థ తెలుగు కథ నవలపై నిర్వహించిన చర్చాగోష్ఠిని శ్రీ రాఘవదాసు ప్రారంభించారు. ఈ సాహిత్య వర్క్‌షాప్ నిర్వహణకు రాష్ట్ర సాహిత్య అకాడమి 500 రూపాయలు సహాయం చేసింది. సాహిత్యఅకాడమి ఉపాధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు. ప్రముఖ సాహితీవేత్త శ్రీ ఎల్లోరా సాహిత్యంలో సామాజిక స్పృహ అవసరాన్ని కర్మ సిద్ధాంత అవగాహనను యువకులు గుర్తించాలి అన్నారు. వారు నవల కథలపై ఒక పేపరు చదివారు. చర్చాగోష్ఠికి వాసిరెడ్డి సీతాదేవి అధ్యక్షత వహించారు. వర్క్‌షాప్ డైరెక్టరు శ్రీ పోతుకూచి సాంబశివరావు రచయితలను ప్రోత్సహించడానికే ఈ కార్యక్రమం నిర్వహిస్తున్నట్లు చెప్పారు.

16వ తేదీ మధ్యాహ్నం అంతర్జాతీయ స్థాయిలో తెలుగు కథ-నవల అనే అంశంపై శ్రీ డి. రామలింగం తమ 'పేపరు' సమర్పించారు. సభకు శ్రీ కె. వి. భాస్కరరావు అధ్యక్షత వహించారు. ఆనాటి చర్చలో పాల్గొన్న కుమారి సీతాదేవి రచయితల గూర్చి వ్యాసకర్త తెలిపిన విషయాలపై అభ్యంతరాలు తెలిపారు. శ్రీ వీరాజీ మాట్లాడుతూ "సమాజంలో అనేక పరిణామాలు వస్తున్న ఈ దశలో వాటిని క్షుణ్ణంగా అర్థం చేసుకుంటేగాని ఉత్తమ కథలు, నవలలు వెలువడడం కష్టం" అన్నారు.

16వ తేదీ ఉదయం "కథనవల-మనో విశ్లేషణం" అనే అంశంపై శ్రీ వీరాజీ అధ్యక్షతన సభ జరిగింది. తెలుగు సాహిత్యంలో మానవ మనస్తత్వ శాస్త్ర రీతులు గల రచనలు చాలా వున్నాయని ఆయన వివరించారు. శ్రీమతి ఇల్లిందుల సరస్వతీదేవి మానవ మనస్తత్వ శాస్త్రం, ఫ్రాయిడ్ సిద్ధాంతాలపై పేపరు చదివారు. ఆమె వ్యాసం పరిపూర్ణంగా లేదని సభ్యులు భావించారు. మధ్యాహ్నం జరిగిన సభకు శ్రీ వేమరాజు నరసింహారావు అధ్యక్షత వహించారు. శ్రీమతి రాణి కమలాదేవి యువతరం రచనలు గూర్చి తమ వ్యాసం సమర్పించారు. ముగింపు సభలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కార్యదర్శి శ్రీ ఇరవెంటి కృష్ణమూర్తి మాట్లాడుతూ సాహిత్యం అనంతమని ఆధునిక సాహిత్యం విరివిగా సృష్టి అవుతోందని అయితే శాశ్వతవిలువలు గల ఉత్తమ సాహిత్య సృష్టికి రచయితలు తోడ్పడాలని అన్నారు. ముగింపులో మొత్తం కార్య గోష్ఠిని సమీక్షిస్తూ, శ్రీ పోతుకూచి సాంబశివరావు యువరచయితలకు తగిన న్యాయం చేకూర్చలేదని దానికి కారణం లబ్ధప్రతిష్ఠులైన రచయితలు, విమర్శకులు ఎక్కువ రచనలు చదువక పోవడమే కారణమన్నారు. కార్యదర్శి శ్రీ గోవిందరాజు వందన సమర్పణ జేశారు.

ఇంకా ఈ శిబిరంలో దాశరథి రంగాచార్య, శీలావీరాజు, కొంపెల్ల విశ్వం, నెల్లూరు కేశవస్వామి, చంద్ర, శ్రీమతులు వేదవతి, వాసా ప్రభావతి, శారదా అశోకవర్ధన్ ప్రభృతి రచయితలు పాల్గొన్నారు.

త్వరలో ప్రారంభం!

### ప్రాక్టీసు పెట్టి చూడు!

★ డాక్టర్లైన వాళ్ళు చదవాలి!

★ ప్రాక్టీస్ పెట్టి నువ్వు వాళ్ళు అంతకన్నా ముందు చదవాలి!

★ అదీ ఇదీ కాని వాళ్ళంతా అసలు డాక్టర్ల రహస్యాల కోసం చదివి తీరాలి! ...

★ గొప్ప "సీరియస్" సంగతులు చాలా "సరదాగ" తెలియజేసే హాస్య రచన. "రాగతి పండరి" వ్యంగ్య చిత్రాలతో ... రచయిత ఎవరంటారా? ఒక డాక్టరే! పేరు పై వారం చూడండి! సం.

కాస్తా ఓర్పు వహిస్తే మీకు ఈ పిప్పి పన్ను బాధ శాశ్వతంగా లేకుండా పోతుంది!




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna

# "ఆగా వాడిచూసి, పరీక్షించి మెచ్చుకున్నవి"




"నిప్పో బ్యాటరీలు ఖచ్చితమైనవని కనిపెట్టేసాను. వాటి నాణ్యత గురించి చేయబడే పరీక్షలు ఖచ్చితమైనవి గనక లక్ష బ్యాటరీలలో ఏదో ఒక్కటి సరిగ్గా పనిచేయకపోవచ్చేమో. నిప్పో బ్యాటరీల పై సీల్ నన్ను ఆకట్టుకుంది. అమోఘమైన శక్తి, తాజాగా, వాడబడకుండా అలాగే ఉందన్నది నూటికి నూరుపాళ్ళు తెలుసుకునే వీలు. కొన్ని నిప్పో బ్యాటరీలు లోహ కవచంగలవి. అన్ని నిప్పో బ్యాటరీలూ జపాన్ దేశపు నేషనల్ వారి పరిశోధనయొక్క మద్దతుగలవి."

—ఆగా

National

## నిప్పో

### టాప్-సీల్ బ్యాటరీలు

జపాన్ దేశపు నేషనల్ వారి సాంకేతిక మద్దతుతో కూడిన అమోఘమైన శక్తి.

**నిప్పో శ్రేణి: ప్రతివాటికీ అనువైనవి, ప్రతివారికీ అందుబాటులో ఉండే బ్యాటరీలు**

everest/79/INL/144 tl















Rainbow Ads

# మీ అందానికి మేలు చేకూర్చే మేకప్ మొదట మీ చర్మానికి మేలు చేకూర్చాలి.



వివిధరకాల మేకప్‌లు మిమ్మల్ని ఆకర్షణీయంగా చేస్తాయి. అవి చేసే మేలు అంతే మరి. కేవలం క్రూక్స్ వారి లాక్టో-కేలమైన్ మాత్రమే మీ చర్మానికి నిజంగా మేలు చేకూరుస్తుంది. అది మీ చర్మాన్ని మనోహరంగానూ, యవ్వనంతో ఉట్టిపడేట్లు చేస్తుంది. నిర్మలంగా తాజాగా అందంగా. ఇంత తక్కువ శ్రమతో మీ చర్మ సౌందర్యానికి మరేదీ-అంత మేలు చేయదు. అంచేతే అది పరిపూర్ణమైన మేకప్. వాడి చూడండి. మీ చర్మసౌందరం ఎంత మనోహరంగా వుంటుందో మీరే గమనించండి. అదో ఆకర్షణీయమైన అనుభూతి మరి!




**3 వీలైన సైజుల్లో దొరుకుతుంది : 120 మిలీ, 60 మిలీ మరియు 30 మిలీ**

క్రూక్స్ లాక్టో-కేలమైన్ ఒక రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్. ఈ మార్క్‌ను ఏ విధంగానైనా అతిక్రమించినవారు శిక్షింపబడతారు.

---

లాక్టో-కేలమైన్ కొనేముందు అసలైనదని రుజువు చేసుకునేందుకు క్రూక్స్ చిహ్నం కోసం, తీసి వేయబడని క్రూక్స్ సీల్ కోసం తప్పక చూడండి.

---

**డూఫార్-ఇంటర్‌ఫ్రాన్ లి.**
పోస్ట్ బాక్స్ నం. 6582, బొంబాయి 400 018

## క్రూక్స్ లాక్టో-కేలమైన్ అందంగా ఉండటానికి సరిక్రొత్త రహస్యం

Sista's-DIL-680/Tel/79.

Dipy's
MIXED FRUIT JAM
HERBERTSONS LIMITED

# డిపీస్ జామ్ వేటితో తయారవుతోంద తెలుసా?

పంచ్‌గని స్ట్రాబెర్రీలు, రత్నగిరి మామిడి పళ్లు, అలహాబాద్ జామ పళ్లు, త్రిచూర్ అనాస పనస పళ్లు, దహానూ బొప్పాయి పళ్లు, జల్‌గావ్ అరటి పళ్లు. సూర్య రశ్మిలో అరముగ్గిన ఉత్తమ జాతుల పళ్ల లోని శ్రేష్ఠత్వాన్నంతా నింపుకొన్న రమ్య రసమయం డిపీస్ మిక్స్‌డ్ ఫ్రూట్ జామ్.

డిపీస్ అంటే అత్యుత్తమ రుచికి పెట్టింది పేరు.

డిపీస్ జామ్‌లు : ఎప్రికాట్, మేంగో (మామిడి పండు), మిక్స్‌డ్ ఫ్రూట్, పైన్‌యాపిల్ (అనాస పనస), రాస్ప్‌బెర్రీ, స్ట్రాబెర్రీ, ఆరెంజ్ మార్మలేడ్, గ్వావా (జామ పండు) జెల్లి.



డిపీస్ జామ్‌లు- ఓ ఫలవంతమైన అనుభవం